# కేంద్రకమిటీ నివేదిక

రెండేండ్ల క్రిందట మనం పాల్ఘాట్‌లో సమావేశ మైనప్పటి పరిస్థితికీ, నేటి పరిస్థితికీ చాలా విషయాల్లో వ్యత్యాసం ఉంది. ఈ రెండు సంవత్సరాల్లో అత్యంత ప్రధాన మైన పరిణామాలు జరిగాయి.

భారత ఆర్థిక వ్యవస్థయొక్క కొన్ని రంగాలలో కలిగిన కొంత అభివృద్ధినీ, రెండవ 'పంచవర్ష ప్రణాళిక చూపిస్తున్న ఆశలనూ, సోషలిస్టు తరహా సమాజమనే నినాదాన్నీ ఆధా రంగా చేసుకొని కాంగ్రెసు నాయకులు, ప్రభుత్వం రెండేండ్ల క్రిందట సాధారణ ఎన్నికల్లో తాము అఖండ విజయం సాధించుతామని ప్రకటించుకున్నారు. ఫ్యూడల్, మతతత్వ అభివృద్ధి నిరోధకపార్టీలు కూడ తమ బలాన్ని గణనీయంగా అభివృద్ధి చేసుకోవచ్చునని ఆశించాయి. అవీ, కాంగ్రెసూ ఇది వరకటికన్నా ఎక్కువ విజయాలు సాధించవచ్చునని ఆశించ డానికి ఒక్కటే కారణం కనిపిస్తోంది. అదే ప్రజాతంత్రశక్తుల మధ్య అనైక్యత, మన పార్టీయొక్క పరిస్థితి.

పాల్ఘాట్ మహాసభకు ముందు మన పార్టీలో తీవ్రమైన రాజకీయ విభేదాలు వృద్ధిచెందాయి. ఆ విభేదాలు, వాటి నెదుర్కోడానికి అనుసరింపబడ్డ పద్ధతులు పార్టీ ఐక్యతను బలహీనపరచాయి. అనేక ప్రాంతాల్లో నిర్మాణానికి సంబం ధించిన కార్యక్రమం స్తంభించింది. తత్ఫలితంగా ప్రజల్లో — ముఖ్యంగా రైతుల్లో — పార్టీ కార్యక్రమం బాగా దెబ్బతింది.

ఇట్టి పరిస్థితుల్లో మనం రెండవ సాధారణ ఎన్నికలకు సన్నాహాలు చేసుకోవలసి వచ్చింది.

పాల్ఘాట్ మహాసభ ఆ రాజకీయ విభేదాలను అధిగమించడానికి పెద్ద ముందడుగు వేసింది. అదే దాని ప్రత్యేకత కూడా. అతివాద పాక్షిక ధోరణికి చెందిన తప్పులను సరిదిద్ది, ప్రత్యామ్నాయ పంథాను ఖచ్చితంగా తిరస్కరించి, భారత దేశ పరిస్థితిని గురించి ఒక నూతనమైన, వాస్తవికమైన అంచనాకు ఆ మహాసభ వచ్చింది. పార్టీ అనుసరించదగు ఎత్తుగడల విధానాన్ని నిర్ణయించి, త్వరలో రానున్న బ్రహ్మాండమైన రాజకీయ పోరాటంలో - రెండవ సాధారణ ఎన్నికల్లో - చేబట్టవలసిన విధానాలను అది రూపొందించింది.

పాల్ఘాట్‌లో మన మా విధానాన్ని రూపొందించి యుండకపోతే తదనుగుణ్యంగా ప్రజల్లో మనం ఆందోళనచేసి యుండకపోతే, దాని కనుగుణ్యమైన ఐక్యసంఘటన పద్ధతులను చేబట్టియుండకపోతే - ఎన్నికల్లో మనం సాధించిన విజయాలు అసంభవమైయుండేవి.

పార్టీయొక్క నిర్మాణ పరిస్థితిని చర్చించడానికి ఆరు మాసాల్లో ఒక ప్రత్యేక విస్తృత సమావేశం జరపాలని పాల్ఘాట్ మహాసభ నిర్ణయించింది. కాని, పార్టీ కమిటీలన్నీ సాధారణ ఎన్నికల్లో నిమగ్నమైయుండుటవల్ల ఆ నిర్ణయాన్ని అమలు జరపడం సాధ్యపడలేదు. ఇంచుమించు అన్ని (ప్రధాన రాష్ట్ర) కమిటీలు విస్తృత సమావేశాన్ని వాయిదా వేయమని కోరాయి. అందుచేత కేంద్ర కమిటీ సాధారణ ఎన్నికల తర్వాతనే విస్తృత సమావేశం జరపాలని నిశ్చయించింది. తర్వాత నిబంధనావళికి సూచింపబడిన మార్పుల దృష్ట్యా

ప్రస్తుతం జరిగే యీ ప్రత్యేక మహాసభను ఏర్పాటుచేయ నిశ్చయించింది.

సాధారణ ఎన్నికల్లో ఆంధ్ర, తమిళనాడ్ రాష్ట్రాలలో మనం చాలా పెద్ద పరాజయాలను పొందాం. కొన్ని రాష్ట్రాలలో అభివృద్ధినిరోధక పార్టీలు స్థానిక విజయాలు సంపాదించాయి. కాని, మొత్తంమీద ఎన్నికలఫలితాలు కాంగ్రెసు యొక్క, ఫ్యూడల్ అభివృద్ధినిరోధక పార్టీలయొక్క, మతతత్వ అభివృద్ధి నిరోధకపార్టీలయొక్క ఆశలను భగ్నమొనర్చాయి.

కాంగ్రెసును అతివాద దృక్పథం నుంచి వ్యతిరేకించే పార్టీలు, గ్రూపులు, వ్యక్తులు అనేక రాష్ట్ర శాసనసభల్లో తమ బలాన్ని గణనీయంగా వృద్ధిచేసుకో గలిగాయి. కాని ఈ పార్టీలన్నిటికన్న మనం గొప్ప విజయాలు సాధించాం.

మనకు 1,20,00,000 ఓట్లు లభించడంతో, దేశం మొత్తంమీద సీట్ల విషయంలోనే కాక ఓట్ల విషయంలో కూడ మనం రెండవపార్టీగా వచ్చాం. 1951 – '52 తో పోలిస్తే మనకు లభించిన ఓట్లు రెట్టింపయాయి.

ఇక పారిశ్రామిక ప్రాంతాల్లో అధిక సంఖ్యాక స్థానాలను మనమే సంపాదించుకో గలిగాం. దీన్నిబట్టి కార్మిక వర్గంలో ఎక్కువ పలుకుబడిగలపార్టీ మనదేనని స్పష్టమయింది.

పార్లమెంటులోను, పశ్చిమబెంగాల్ – ఆంధ్ర శాసన సభల్లోను తిరిగి మనమే ప్రధాన ప్రతిపక్షంగా వచ్చాం.

ఈరోజున ప్రతి రాష్ట్ర శాసనసభలోను మన ప్రతినిధు లున్నారు. పోలైన ఓట్లనుబట్టి స్థానాలు లభించాలన్న సూత్రాన్ని నిరాకరించే ప్రజాతంత్ర వ్యతిరేకపద్ధతి అమల్లో

లేకపోయినట్లయితే, మెజారిటీ రాష్ట్రాలలో మనం ఇంకా యెక్కువ విజయాలు సంపాదించి యుండేవాళ్ళం.

అన్నిటికన్న ముఖ్యవిషయమేమంటే, కేరళ రాష్ట్రంలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంక్రింద నూతన ప్రభుత్వ స్థాపింపబడింది. పాలకవర్గ పార్టీయైన కాంగ్రెసు తన గుత్తాధికారాన్ని కోల్పోవడమనే విషయం దేశం మొత్తానికి అత్యంత ప్రధానమైన పరిణామం.

మార్క్సిజం - లెనినిజం భారతదేశానికి వర్తించదనీ, భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర తప్పులచరిత్ర అనీ ప్రదేశ దే ఊపిరిసలపకుండా చెప్పే మన వ్యతిరేకులు యీ ఫలితాలను చూచి దిగ్భ్రమ చెందసాగారు.

సాధారణ ఎన్నికలవల్ల కలిగిన ఒక ముఖ్యమైన ఫలితమేమంటే, దేశంయొక్క రాజకీయ పరిస్థితిని గురించి మనలో మరింత సక్రమమైన అవగాహన ఏర్పడింది; దాని ఆధారంమీద మరింత ఐక్యత ఏర్పడింది; మన మధ్యగల విభేదాలు అదివరకుకంటె తగ్గాయి; పార్టీలో ఐక్యత బలపడడానికి తోడ్పడింది. ప్రజల్లో పనిచేయడంద్వారా ప్రజా ఉద్యమాలను నిర్మించడంద్వారా కలిగే అనుభవం దీర్ఘచర్చలవల్ల పరిష్కరింపబడని వివాదాలను సైతం పరిష్కరించగల్గుతుందని మరొకసారి రుజువైంది.

ఎన్నికలలో కమ్యూనిస్టుపార్టీ మరింత పలుకుబడిని, ప్రతిష్టను, శక్తిని సంపాదించింది.

1951 - 52 లోను, 1957 లోను జరిగిన ఎన్నికల ఫలితాలను పోల్చిచూస్తే, గత 5 సంవత్సరాల్లోను మనపార్టీ

దేశం మొత్తంమీద ఎంత విస్తృతమైన పలుకుబడిని సంపాదించిందో బోధపడుతుంది.

1951 - 52 సాధారణ ఎన్నికల్లో మనకు బీహారు, యు. పి., మధ్యప్రదేశ్, రాజస్థాన్‌లలో ఒక్కస్థానమైనా లభించలేదు. కాని యీసారి ఆయా ప్రతిరాష్ట్ర శాసనసభలోను మన ప్రతినిధు లున్నారు.

1951 - 52 ఎన్నికల్లో మనకు మొత్తం 62,00,000 ఓట్లు లభించాయి. వాటిలో 23,00,000 ఆంధ్ర, తెలంగాణాల లోనే లభించాయి. మిగతా రాష్ట్రాలలో దేనిలోనూ 10 లక్షలకు మించి ఓట్లు లభించలేదు. కాని యీసారి మనకు కేరళలో 23 లక్షల ఓట్లు, పశ్చిమ బెంగాల్లో 19 లక్షలు, ఆంధ్రలో 25 లక్షలు, పంజాబులో 10 లక్షలు వచ్చాయి. గతంలో మనబలం చాల తక్కువగా ఉన్న రాష్ట్రాలలో సైతం మన ఓట్లు గణనీయంగా పెరిగాయి.

సాధారణ ఎన్నికల్లో ప్రజా సామాన్యం అతివాద భావాలవైపు, కమ్యూనిస్టుపార్టీవైపు చూపిన మొగ్గు ఎన్నికల తర్వాత కూడా నిలిచే ఉంది.

అ. భా. ట్రే. యూనియన్ కాంగ్రెసుకు అనుబంధింప బడిన యూనియన్ల సభ్యత్వం, పలుకుబడి గణనీయంగా పెరిగాయి. ముఖ్యంగా బెంగాల్, బీహారు రాష్ట్రాలలోని గని ప్రాంతాల్లోను, పారిశ్రామిక ప్రాంతాల్లోను కమ్యూనిస్టుపార్టీ పలుకుబడి చాలా హెచ్చింది.

అంతేకాదు. "స్వాధీనత" (పార్టీపత్రిక)నిధికి రెండు లక్షల రూపాయలు వసూలు చేయాలని పార్టీ యిచ్చిన పిలుపుసందర్భాన్ని పశ్చిమ బెంగాల్ ప్రజలు చాలా పెద్ద

మొత్తాలను విరాళాలుగా యిచ్చారు. ఆంధ్ర, తమిళనాడ్ రాష్ట్రాలలో కూడా పార్టీ నిధికి విరాళాలు హెచ్చుగా లభించాయి. కేరళ రాష్ట్రంలో ప్రజా సంఘాలు వేగంగా అభివృద్ధి చెందుతున్నాయి. ఇతర రాష్ట్రాలన్నిటిపైన కేరళ రాష్ట్రం యొక్క ప్రభావం దినదినాభివృద్ధి చెందుతోంది. ఆంధ్ర, మహారాష్ట్ర, యు పి., బీహారు, మధ్యప్రదేశ్, ఢిల్లీ రాష్ట్రాలలో స్థానిక సంస్థలకు జరిగిన ఎన్నికల్లో కమ్యూనిస్టుపార్టీ అనేక విజయాలు సంపాదించింది. వీటన్నిటివల్ల కూడా పార్టీ పలుకుబడి ఎలా హెచ్చుతోందో తెలుసుకోవచ్చు.

యు. పి., మధ్యప్రదేశ్ లలో మనం చిరకాలంనుంచి బలహీనస్థితిలోనే ఉంటూ వచ్చాం. కాని యిటీవల జరిగిన మున్సిపల్ ఎన్నికలలో మనబలం పెరిగింది. యు. పి. లో మనం 14 పట్టణ మున్సిపాలిటీ ప్రాంతీయ కమిటీలలో మెజారిటీ స్థానాలు సంపాదించాం. గతంలో యిట్టి పరిస్థితి ఏ ఒక్క ప్రాంతంలోను లేదు. మధ్యప్రదేశ్ లో మనం ఒక మున్సిపాలిటీలో మెజారిటీ సంపాదించి, అనేక యితర మున్సిపాలిటీలలో బలమైన స్థానాలను సంపాదించాం.

యు. పి. మున్సిపల్ ఎన్నికల ఫలితాలను గురించి వ్యాఖ్యానిస్తూ ఒక బెనారస్ దినపత్రిక "కాంగ్రెసు అధికారాన్ని సవాలుచేసే రాజకీయపార్టీగా కమ్యూనిస్టుపార్టీ ముందుకువచ్చి నిలబడింది" అని వర్ణించింది.

మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి డాక్టరు కట్జూ యీమధ్య కాంగ్రెసు ప్రచారకుల సభలో ఉపన్యసిస్తూ "రాష్ట్రంలో

పెచ్చుపెరుగుతున్న కమ్యూనిస్టు ప్రాబల్యాన్ని గురించి హెచ్చరించారు.

ఇవన్నీ చాల ప్రధానమైన పరిణామాలు.

ఇదివరకే చెప్పినట్లు, మనం చాల పెద్ద చిక్కుల్లో ఉంటూ ఎన్నికలలో ప్రవేశించాం. మనల్ని వ్యతిరేకించేవారే కాక, అభిమానించే అనేకమంది స్నేహితులు సైతం చాల చోట్ల మనం ఓడిపోతామనుకున్నారు. కాని వారి అంచనాలు తలక్రిందులయాయి. ఇందుకు కారణాలు ఎన్నికలసమీక్షలో వివరింపబడ్డాయి. వాటిలో అత్యంత ప్రధానమైన వాటిని యిక్కడ పేర్కొనవలసియుంది.

ప్రజల్లో అధికమవుతూన్న అతివాద భావాలమీద, ప్రభుత్వ విధానాలయెడ వారిలో పెచ్చుపెరిగే అసంతృప్తి మీద, ఉన్నతమైన జీవిత విధానం కొరకు వారిలో కలుగుతున్న ఆకాంక్షమీద ఆధారపడి అనేక ప్రాంతాల్లో మనం స్థానిక సమస్యలపైన, వర్గ సమస్యలపైన, ఆర్థిక సమస్యలపైన పోరాటాలు నడిపాం. అంతేకాదు. గోవావిముక్తి, భాషా రాష్ట్రాల స్థాపన, పౌరసత్వ హక్కులు మొదలైన విస్తృత రాజకీయసమస్యలపై ప్రజాఉద్యమాలను నడిపాం.

దేశంలో ఏ యితరపార్టీ చేయజాలనంత తీవ్ర ఆందోళన ప్రజల్లో మన పార్టీ చేసింది.

కాంగ్రెసు గుత్తాధికారాన్ని బలహీన మొనర్చాలనీ, సాధ్యమైనన్ని చోట్ల ప్రత్యామ్నాయ ప్రభుత్వాలను స్థాపించాలనీ, దేశమంతటా ప్రజాతంత్ర ప్రతిపక్షాన్ని బలపరచాలనీ అభిలషించే ప్రజల కోర్కెలకు మనం రూపకల్పనచేసి, అందు

కోసం అతివాద శక్తులమధ్య ఐక్యత నెలకొల్పడానికి కృషి చేశాం.

మనమధ్య విభేదాలున్నప్పటికీ, ఐక్యతతో మనమంతా ఎన్నికల పోరాటంలో ప్రవేశించాం. ఇంచుమించు అన్ని ప్రాంతాల్లోను మన కామ్రేడ్స్ అంతకుముందు తామెలాంటి అభిప్రాయాలను కలిగియున్నా ఎన్నికల పోరాటంలో ఒక్కుమ్మడిగా దుమికి. పార్టీని గెలిపించేందుకు శాయశక్తులా పనిచేశారు. పార్టీ అభిమానులు, శ్రేయోభిలాషులు అనేక మంది చాలా కష్టపడి పనిచేశారు. వారిలో కొందరు అత్యుత్తమమైన, బాగా రాటుదేరిన పార్టీ కార్యకర్తలతో సమానంగా కష్టపడ్డారు.

మరొక విషయాన్ని కూడా మనం గుర్తించాలి. మనం సాధించిన విజయాలు గత కొద్ది సంవత్సరాలకృషి ఫలితమే కాదు. కమ్యూనిస్టుపార్టీ భారత రాజకీయరంగంలో ప్రవేశించినప్పటినుంచీ అది కొనసాగించిన కార్యక్రమాలన్నిటి వల్ల, అది బలపరచిన ఉద్యమాలన్నిటివల్ల, అది నడిపిన పోరాటాలన్నిటివల్ల, అది నిర్మించిన ప్రజాసంఘాలన్నిటివల్ల మన కా విజయాలు లభించాయి. అనేక సంవత్సరాలు తీవ్ర, నిర్విరామ, నిస్వార్థ కృషిద్వారా ప్రజలతో మనకు సాన్నిహిత్యం ఏర్పడ్డంవల్ల మన మీా విజయాలను సాధించగలిగాం. ప్రతిరంగంలోను కమ్యూనిస్టుపార్టీ, కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తలు, నాయకులు మూడు దశాబ్దాలపాటు కొనసాగించిన కార్యకలాపాలన్నిటి ఫలితంగానే కమ్యూనిస్టుపార్టీ నేడు మన దేశంయొక్క రాజకీయజీవితంలో యీస్థానం సంపాదించ గలిగింది.

## నూతన సభ్యుల్ని చేర్చుకొనే ఉద్యమం: దాని ఫలితాలు

మనం సాధించిన విజయాలను ఆధారంగా చేసుకొని ప్రజాతంత్ర ఉద్యమాన్ని మనం మరింత ముందుకు తీసుకెళ్ళాలి. ఇందుకు ప్రధానంగా ప్రజా కమ్యూనిస్టుపార్టీని నిర్మించవలసిన అవసరం ఉంది. అలాంటి పార్టీని రూపొందడానికి మనం నిర్వర్తించవలసిన కర్తవ్యాలు యీ మహాసభముందుంచబడిన రాజకీయ తీర్మానంలో పేర్కొనబడ్డాయి. వాటిని మళ్లీ యిక్కడ పేర్కొనవలసిన అవసరం లేదు.

అయితే, ఒకటి మాత్రం మనమంతా గుర్తించవలసి యుంది. దేశం మొత్తం మీద చూస్తే మన పార్టీ యింకా తగినంత బలీయమైన శక్తిగా రూపొంద లేదు. దాని పలుకుబడి అన్ని రాష్ట్రాలలోను, అన్ని ప్రాంతాలలోను ఒకే విధంగా లేక, తరతమ స్థాయిలలో ఉంది.

భారత దేశంలో 14 రాష్ట్రాలున్నాయి. కాని మూడు రాష్ట్రాలలో మాత్రమే - కేరళ, ఆంధ్ర, పశ్చిమ బెంగాల్ - మనం బలీయమైన శక్తిగా ఉన్నాం. ఈ మూడు రాష్ట్రాల జనాభా 7 కోట్ల 20 లక్షలు. మొత్తం జనాభాలో 100 కి 20 వంతులు యీ మూడు రాష్ట్రాలలో ఉన్నారన్నమాట. ఎన్నికల ఫలితాలను పరిశీలించినట్లయితే, మనం యితర రాష్ట్రాలన్నింటిలోను బలహీనంగా ఉన్నామని తెలుస్తుంది. ముఖ్యంగా, హిందీ మాట్లాడే పెద్దవిస్తీర్ణంగల ప్రాంతంలో మన బలహీనత మరింత స్పష్టంగా కనిపిస్తుంది. ఈ ప్రాంతంలో 15 కోట్ల ప్రజలు నివసిస్తున్నారు. మొత్తం జనాభాలో వీరు 100 కి 40 వంతులు పైగా వుంటారు. బీహార్, ఉత్తరప్రదేశ్,

మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలు, పంజాబులోని హార్యానా ప్రాంతం దీని క్రిందికి వస్తాయి. కాంగ్రెసు యిక్కడ చాల బలంగా ఉండటమే కాక, కొన్ని చోట్ల ఫ్యూడల్ పార్టీలు, మతతత్వ పార్టీలు గణనీయమైన స్థాయిలో కాంగ్రెసును ఓడించి తమ స్థానాన్ని బలపరచుకోగలిగా యన్న విషయాన్ని గమనించాలి. ఒరిస్సాలో కూడ యిలాంటి పరిస్థితే ఉంది; అక్కడ గణతంత్ర పరిషత్తు బలమైన స్థానంలో ఉంది. మద్రాసు రాష్ట్రంలో ప్రత్యేక ద్రవిడస్థాన్ నినాదంతో ద్రవిడ మున్నేత్రకజగం కూడ ఒక బలమైన శక్తిగా తయారైంది.

అంతేకాదు. మన కెక్కువ పలుకుబడిఉండి, ఫ్యూడల్ మతతత్వ శక్తులకు తక్కువబలం ఉన్న రాష్ట్రాలలో సైతం మన పలుకుబడి అన్ని చోట్లా ఒకేవిధంగా లేదు. ఉదాహరణకు పశ్చిమ బెంగాల్లో మనం బలమైన శక్తిగానే ఉన్నప్పటికీ, కొన్ని జిల్లాలలో మాత్రమే నిర్ణయాత్మక శక్తిగా ఉన్నాం. ఇతర జిల్లాలలో మన పలుకుబడి అతి తక్కువ.

అధికసంఖ్యాక రాష్ట్రాల్లోని రైతాంగంలో మనకున్న బలహీనతను గురించి రాజకీయ తీర్మానం నొక్కి చెప్పింది.

అన్నిటికంటె ప్రధానవిషయమేమంటే, మన పార్టీ యొక్క నిర్మాణబలం, ఉద్యమస్థాయి ప్రజల్లో మనకున్న పలుకుబడికి తగినట్లుగా లేక వెనుకబడి ఉన్నాయి.

ప్రజల్లో మనకున్న పలుకుబడితో పోల్చుకుంటే, పార్టీ సభ్యత్వం చాల తక్కువగావుంది. పాల్ఘాట్ మహాసభనాటికి మన సభ్యత్వం 1,00,000. అంటే మనకు పోలైన ప్రతి

120 ఓట్లకు ఒక సభ్యుడు చొప్పున ఉండేవారన్నమాట. ప్రపంచంలో ఏ యితర దేశంలోను యిట్టి పరిస్థితి లేదు.

మన పార్టీలో తక్కువమంది సభ్యులుండడం కొత్త విషయంకాదు. మొదటి సాధారణ ఎన్నికల తర్వాత కేంద్ర కమిటీ తయారుచేసిన సమీక్షలోనే యీ సమస్య ప్రస్తావించ బడింది; ఇంకా ఎక్కువమంది సభ్యుల్ని పార్టీలో చేర్చుకో వలసిందన్న ఆదేశంకూడా అందులోఉంది. కాని కొత్త సభ్యుల్ని చేర్చుకోనేందుకు, వారిని విజ్ఞానవంతులుగా చేసి కార్యకర్తలుగా తయారుచేసుకోనేందుకు నిర్దిష్టమైన, శక్తివంత మైనచర్యలను మనంతీసుకోలేదు. మొదటి, రెండవ సాధారణ ఎన్నికల మధ్య మన పార్టీకి గల పలుకుబడికీ, దాని నిర్మాణ బలానికీ మధ్య వ్యత్యాసం అలా ఉండడమేగాక యింకా పెరి గింది కూడ.

పార్టీని బలవత్తరంచేసే దృష్టితో కేంద్రకమిటీ రెండవ సాధారణ ఎన్నికలతర్వాత పార్టీ సభ్యత్వాన్ని పెంచవలసిం దనీ, 1957 లోగా దాన్ని రెట్టింపు చేయవలసిందనీ నినాద మిచ్చింది. ఇది యించుమించు అన్ని రాష్ట్రాలలోను అమలు జరుపబడింది. ఇటీవలి మాసాల్లో పార్టీ సభ్యత్వం గణ నీయంగా పెరిగింది.

కొత్త సభ్యుల్ని చేర్చుకొనే ఉద్యమం ప్రారంభం కాక ముందు మన సభ్యత్వం 1,25,000; ప్రస్తుతం అది 2,18,532 కి పెరిగింది.

## శక్తివంతమైన నాయకత్వం కావాలి

పార్టీ సభ్యత్వం పెరిగింది. కాని ప్రజాకమ్యూనిస్టు

పార్టీ నిర్మాణానికి అదొక్కటే చాలదు. పార్టీసభ్యుల సిద్ధాంత - రాజకీయ స్థాయిని హెచ్చుచేయవలసి యుంది.

మొత్తం పార్టీసభ్యత్వాన్ని ఒక సంఘటిత, సుశిక్షిత శక్తిగా తయారుచేయవలసి యుంది. వారందరి దృక్పథం, మనోనిశ్చయం, కార్యాచరణ ఒకే విధంగా ఉండేటట్లు చూడాలి. అన్నిస్థాయిలలోను ప్రజలతో అత్యంత సన్నిహిత మైన సంబంధం కలిగియుంటూ, కార్యరంగంలో వారిని నడి పించగల శక్తివంతమైన నాయకత్వాన్ని మనం నిర్మించుకో గలగాలి.

కాని యీ అన్నివిషయాల్లోను మన పరిస్థితి అవ సరాలకు తగినట్టుగా లేదు.

మన ఉద్యమం పెరిగింది. మన బాధ్యతలు పెరిగాయి. అయితే అందుకు తగిన విధంగా అన్నిస్థాయిలలోను మన నాయకత్వం పరిపక్వం కాలేదు; సామర్థ్యం పెంపొందలేదు. ప్రతిచోటా మన బాధ్యతలకు తగినట్లు నిలబడడం కష్టమవు తోంది. శక్తివంతమైన నాయకత్వం తక్కువయింది; శక్తి వంతమైన కార్యకర్తలు లోపించారు.

ఈ లోపం అన్నిచోట్ల ఒకేవిధంగా లేకపోయినా, మొత్తం పనిలో యిది స్పష్టంగా ప్రతిబింబిస్తోంది. ఈ లోపాన్ని తొలగించుకోడం అత్యంత ప్రాధానమైన కర్తవ్యం.

ఈ విషయంలో కేంద్ర నాయకత్వం కీలక పాత్ర వహించవలసియుంది. ఇదెలా సాధ్యమో పార్టీ మహాసభ జాగ్రత్తగా ఆలోచించవలసియుంది. ఇందుకు సహాయకారిగా కేంద్రంయొక్క కార్యకలాపాలను క్లుప్తంగా వివరించి, వాటి లోపాలను పేర్కొంటాం.

# పార్టీ కేంద్రం

పాల్ఘాట్ మహాసభ జరిగినవెంటనే పార్టీ నిర్వ హించ వలసిన అతిప్రధానమైన కర్తవ్యం సాధారణ ఎన్నికల్లో చురుగ్గా పాల్గొనడం. ఎన్నికల కార్యక్రమానికి తొలి ప్రాధా న్యత యివ్వాలని కేంద్ర కమిటీ నిశ్చయించుకొంది.

ప్రధాన కార్యదర్శితో సహా కేంద్రకమిటీలో అనేక మంది సభ్యులు చాల రాష్ట్ర కమిటీ సమావేశాలకు వెళ్ళి, పాల్ఘాట్ మహాసభ తీర్మానాన్ని వివరించి, ఎన్నికల ఏర్పా ట్లకు సహాయపడ్డారు.

పాల్ఘాట్ తీర్మానంలోని విధానాని కనుగుణ్యంగా 1956 జూన్ మాసంలో సమావేశమైన కేంద్రకమిటీ అతివాద పార్టీలతోను, గ్రూపులతోను, శక్తులతోను ఎలాంటి ఐక్య సంఘటన పద్ధతులను జేబట్టాలో తెలియజేసింది. ఆ సమావే శంలో చాలా విషయాలపై చర్చలు జరిగాయి. తర్వాత సమావేశంలో మహారాష్ట్ర, గుజరాత్, రాజస్థాన్ కమిటీ లతో సంప్రతించి ఆ రాష్ట్రాలలో అనుసరించవలసిన ఐక్య సంఘటన పద్ధతులపై కొన్ని నిర్ణయాలు చేసింది.

ఎన్నికల ప్రచారంకొరకు అనేక కరపత్రాలను ప్రచు రించడాని కొక కార్యక్రమంకూడ తీసుకోబడింది. కాని వాటిని తయారుచేయడానికి బాధ్యత తీసుకున్న కామ్రేడ్స్ తమ విధులను నిర్వ హించనందున ఆ కార్యక్రమం పాక్షికంగా మాత్రమే అమలుజరిగింది. ప్రధానంగా ప్రచురణాలయ కామ్రేడ్స్ సహాయంతోనే ఆ కరపత్రాలు ప్రచురింప బడ్డాయి.

1956 నవంబరులో కేంద్రకమిటీ సమావేశమై ఎన్నికల ప్రణాళికకు సంబంధించిన అంశాలను చర్చించింది. ఆ తర్వాత పొలిట్ బ్యూరో సభ్యులు ఎన్నికల ప్రణాళికను తయారు చేశారు. 'న్యూఏజ్' వారపత్రిక ఎన్నికల ప్రచారానికి దోహదం చేసేవిధంగా నడుపబడింది. కమ్యూనిస్టుపార్టీ యొక్క ఎన్నికల నినాదాలను విశదీకరించడానికి అనేక పత్రికా గోష్ఠులుజరిగాయి. మొత్తంమీద ఎన్నికల ప్రచారం నిర్విరామంగాను కట్టుదిట్టంగాను, ఉన్నతమైన రాజకీయ స్థాయిలోను జరిగింది.

ఎన్నికల ప్రచారం సందర్భంలోనే ప్రధాన కార్యదర్శి అనేక రాష్ట్రాలను సందర్శించారు. కా|| మేడ్ భూపేష్‌గుప్త కూడా చాలరాష్ట్రాలకు వెళ్ళారు. పొలిట్‌బ్యూరోలోని యితర సభ్యులు ప్రధానంగా తమ రాష్ట్రాల్లోనే పనిచేశారు. పొలిట్‌బ్యూరో ఆదేశించినప్పటికీ, అన్ని రాష్ట్ర కమిటీలు తమ ప్రధానోపన్యాసకుల్ని యితరరాష్ట్రాలకు పంపించజాలమని చెప్పడంవల్ల కేంద్రం యింకా పెద్దయెత్తున ఉపన్యాసకుల్ని పంపి సహాయపడలేక పోయింది. ఇందువల్ల వివిధ రాష్ట్రాలలో – ముఖ్యంగా పార్టీ బలహీనంగా వున్న రాష్ట్రాలలో – చెడ్డ ఫలితాలు కలిగాయి.

ఎన్నికల తర్వాత పొలిట్‌బ్యూరో కేరళలో సమావేశమైంది. దాని ఉద్దేశం కమ్యూనిస్టుపార్టీ నాయకత్వానవున్న మంత్రివర్గం ఎట్టి విధానమవలంబించాలో స్థూలంగా ఆదేశాలివ్వడం.

సాధారణ ఎన్నికలనుంచి నేర్చుకోవలసిన గుణపాఠా లను చర్చించి వాటి ఆధారంమీద కేంద్రకమిటీ ఎన్నికల సమీక్షను తయారు చేసింది.

ఈ దశలోనే పార్టీ అత్యంత ప్రాధాన్యం గల సిద్ధాంత సమస్యల నెన్నిటినో ఎదుర్కొంది. అయితే వీటిలో అనేక సమస్యలపై ఎప్పటికప్పుడు ఖచ్చితమైన అభిప్రాయాలను తెలియజేయలేక పోయాం. అయినప్పటికీ, వ్యక్తి పూజకు వ్యతిరేకంగా కొనసాగిన పోరాటాన్ని గురించి ఒక తీర్మానం చేశాం. ఇది పార్టీలోపల స్థూలమైన ఆమోదం పొందింది. హంగరీలో తొలి గందరగోళం తొలగిపోగానే అక్కడి పరిణామాలను గురించి పార్లమెంటులో మన ప్రతినిధులు సక్రమమైన వైఖరిని ప్రదర్శించారు. శ్రీ జయప్రకాశ్ నారాయణ జాబుకు నిశితమైన జవాబు వ్రాయడం కూడా జరిగింది.

భారతదేశానికి బయటనున్న ఒక దేశంలో భారత దేశ పరిస్థితిని గురించీ, సోషలిజంవైపు పురోగమించడంలో మన దేశం అనుసరించదగు మార్గాన్ని గురించీ కొన్ని అవ సవ్యమైన అంచనాలతో ఒక వ్యాసం ప్రచురింపబడినప్పుడు పొలిట్‌బ్యూరో దాన్ని బహిరంగంగా విమర్శించి, పార్టీ యొక్క దృక్పథాన్ని తెలియజేసింది. ఆ వ్యాసాన్ని పార్టీ అంతరంగిక చర్చకు ప్రాతిపదికగా తీసుకోవాలంటూ కొందరు కామ్రేడ్స్ చేసిన సూచనను కేంద్ర కమిటీ తిరస్కరించింది.

పంచవర్ష ప్రణాళిక విషయంలో అనుసరించవలసిన వైఖరిని గురించి పొలిట్‌బ్యూరో పార్లమెంటరీ ఉపసంఘానికి కొన్ని సూచనలు చేసింది.

సాధారణ ఎన్నికలకు ముందు పార్టీ పత్రికల, ప్రచురణా లయాల ప్రతినిధుల్ని సమావేశపరిచాం. అనేక సమస్యలపై చర్చ జరిగింది. పార్టీ పత్రికల నెలా నడపాలో తెలియజేస్తూ కొన్ని స్థూలమైన ఆదేశాలివ్వబడ్డాయి. అనేక సూచనలు ఆ సమావేశంలో చేయబడ్డాయి. కాని రాష్ట్రకమిటీలు వాటి విషయమై బాగా శ్రద్ధ తీసుకున్నప్పుడే అవి అమలు జరుగు తాయి. కాని అట్టి శ్రద్ధ లోపించింది.

పాల్ఘాట్ మహాసభ తర్వాత, మలబార్ కమిటీలో కేంద్ర కమిటీ విధానాన్ని వ్యతిరేకించిన కొందరు సభ్యులు ఆ విధానాన్ని బలపరిచేవారుమాత్రమే నాయకత్వ స్థానాల్లో వుండాలని పట్టుపట్టారు. రెండు దృక్పథాలవారూ రాష్ట్రకమి టీలో సభ్యులుగా వుండాలని మిగతావారెంత చెప్పినప్పటికీ వారు వినలేదు. దీనిపై పొలిట్‌బ్యూరో తన అభిప్రాయం చెప్పింది. కేంద్రకమిటీతో భేదించేవారు నాయకత్వ స్థానాల్లో ఉండకపోవడం సరికాదని తెలియజేసింది.

ఆంధ్రరాష్ట్రంలో పార్టీని ఐక్యపరిచేందుకు కేంద్రం సహాయపడింది. పంజాబులో ఉత్పన్నమైనభాషాసమస్యపైన, ప్రాంతీయ సమస్యపైన ఒక విధానాన్ని రూపొందించింది. ఒరిస్సాలో అవలంబించవలసిన విధానమెలాఉండాలో తెలియ జేసింది. బీహారు, రాజస్థాన్, కేరళ రాష్ట్రాలలో పార్టీ పనిని మెరుగు పరచేందుకు తోడ్పడింది.

విద్యార్థి, యువజన, మహిళా వుద్యమాలకు సంబం ధించిన నాయకులతో కేంద్రం వేర్వేరుగా సమావేశాలు జరి పింది. విద్యార్థులలో పని ఎలాచేయాలో తెలియజేస్తూ ఒక తీర్మానంచేసి, దాన్ని రాష్ట్ర కమిటీలకు పంపింది.

ఇటీవలి మాసాల్లో కేంద్రకమిటీ పరిష్కరించిన ప్రధాన సమస్యలలో ఒకటి భాషా సమస్య. దీనిపై కేంద్ర కమిటి రూపొందించిన విధానాన్ని మొత్తంమీద దేశం హర్షించింది. శ్రీ టి. టి. కృష్ణమాచారి ప్రకటనలమీద, చర్యల మీద మన పార్టీ చేసిన తీర్మానాలను కూడా అనేకులు అభినందించారు.

చైనా కమ్యూనిస్టు పార్టీ మహాసభకు, . ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీ మహాసభకు మనం ప్రతినిధులను పంపాం. అక్టోబరు విప్లవంయొక్క 40 వ వార్షికోత్సవ సభల్లోకూడా మనం పాల్గొన్నాం. పార్టీ ప్రధాన కార్యదర్శి యిటీవల ప్రాగ్‌లో జరిగిన సమావేశానికి హాజరయ్యారు. ఆ సమావేశం అంతర్జాతీయ కమ్యూనిస్టు పత్రికను ప్రచురించడానికి నిశ్చయించుకొంది.

కేంద్ర కమిటీ కార్యాలయంలో ఖర్చులు తగ్గించుకోడానికి కొన్ని కట్టుదిట్టమైన చర్యలు తీసుకోబడ్డాయి. పార్లమెంటరీ ఆఫీసు నిధులు, కేంద్రకమిటీ నిధులు ఏకీకృతం చేయబడ్డాయి.

నూతన నిబంధనావళి (ముసాయిదా) నొకదాన్ని తయారుచేసి, దాన్ని ప్రస్తుత మహాసభ ముందుంచుతున్నాం.

అయినప్పటికీ, మొత్తంమీద చూస్తే సిద్ధాంత - రాజకీయ నాయకత్వం, ప్రజల్లో చేయవలసినపని, పార్లమెంటులో నిర్వర్తించవలసిన విధులు, రాష్ట్ర కమిటీలకు చేయవలసిన సహాయం - వీటి విషయంలో కేంద్రకమిటీ చేసినపని చాల స్వల్పమనే చెప్పాలి. ఎందువల్ల?

మొదటి కారణం: కేంద్రంయొక్క విధులను నిర్వ ర్తించడానికి చాల తక్కువమంది కామ్రేడ్స్ ఉన్నారు. పాల్ఘాట్ మహాసభ తర్వాత కొద్దిరోజులు తప్ప సాధారణ ఎన్నికలు పూర్తిఅయ్యేవరకు యిద్దరు కామ్రేడ్స్ మాత్రమే - ప్రధాన కార్యదర్శి, కామ్రేడ్ భూపేష్‌గుప్త - తమ పూర్తి కాలాన్ని కేంద్రంపనికి వినియోగించారు. ఎన్నికల అనంతరం కామ్రేడ్ అహమ్మద్ కేంద్రంలో పనిచేయడానికి వచ్చారు. ఆయన చాలవరకు కేంద్రానికి సహాయపడ్డారు.

రెండవకారణం: పొలిట్‌బ్యూరో పనిచేయలేదు. ఈ విషయంలో పాల్ఘాట్ మహాసభతర్వాత నున్న పరిస్థితి బాగు పడనేలేదు. పొలిట్‌బ్యూరో సభ్యులలో అధిక సంఖ్యాకులు యిదివరకు మాదిరిగానే యిప్పుడు కూడా పూర్తిగా తమ రాష్ట్రాలలో కేంద్రీకరించి పనిచేస్తున్నారు.

మూడవకారణం. కేంద్రకమిటీ సభ్యులు కేంద్రం యొక్కపనిని తమ బాధ్యతల్లో ఒకభాగంగా పరిగణించడం లేదు. ఈ సందర్భంలో కొన్ని ఉదాహరణ లివ్వవచ్చు. అనేక సార్లు కోరినప్పటికీ వారు పార్టీ పత్రికలకు వ్యాసాలు వ్రాయరు. కేంద్రం పంపే సర్క్యులర్ల యెడ వారు చాల అశ్రద్ధ వహిస్తారు. రాష్ట్ర కమిటీలు తమ రాష్ట్రాలలో జరిగే కార్య కలాపాలను గురించి రిపోర్టులు పంపేటట్లు వారు చూడరు.

నాల్గవ కారణం: కేంద్రంలో పనిచేసే కొద్దిమంది కామ్రేడ్స్‌కూడా సమిష్టిగా పనిచేసేందుకుగాను తమ పనులను క్రమబద్ధ మొనర్చుకోరు. ఎవరిమట్టుకు వారు 'తమ సొంత రంగాల్లో' వ్యక్తిగత విధానాలపై పని చేస్తున్నారు. వారి కార్యకలాపాలపై అజమాయిషీ అంటూ లేదు.

ఐదవ కారణం: పార్టీ కేంద్రానికీ, రాష్ట్ర కమిటీలకూ మధ్య తగినంత సంబంధం లేదు. కేంద్రకమిటీ సమావేశాలకు వెళ్లినప్పుడుతప్ప ప్రధాన కార్యదర్శి, పొలిట్‌బ్యూరో సభ్యులు వేర్వేరు రాష్ట్రాలకు వెళ్లినప్పుడు మాత్రమే రాష్ట్రకమిటీ లతో సంబంధాలేర్పడుతూ వుంటాయి. అయితే ఆ పర్యటనలు చాల కొద్దిరోజులకే పరిమిత మవడంవల్ల అసలు సమస్య లను లోతుగా పరిశీలించడం అసంభవ మవుతుంది. వారైనా ఎన్నడూ వెళ్లని రాష్ట్రాలు చాల వున్నాయి. ఈవిధంగా, వివిధ రాష్ట్రాల పరిస్థిత ప్రజా వుద్యమాల సమస్యలు పై పైన మాత్రమే తెలుస్తూండడంవల్ల వాటికి కేంద్రం నిర్దిష్ట మైన మార్గం చూపలేకపోతూంది.

వీటన్నిటినిబట్టి, తన్నెదుర్కొంటున్న గురుతర బాధ్యత లను నిర్వర్తించగల పార్టీ కేంద్రం నేడు లేదనే చెప్పవలసి యుంటుంది.

పాల్ఘాట్ మహాసభలో నిర్మాణసమస్యలపై చర్చ జరిగినప్పుడు అందులో పాల్గొన్న ప్రతి కామ్రేడూ యీ లోపాన్ని ఎత్తిచూపాడు. ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించకపోతే పార్టీపని చక్కబడ్డం అసాధ్యమని ప్రతివారూ అభిప్రాయ పడ్డారు. ఈ కర్తవ్యాన్ని యిక నిర్లక్ష్యం చేయబోమని కేంద్రకమిటీ హామీయిచ్చింది. కాని అది దాన్ని నిలబెట్టుకో లేదు.

ఈవిధంగా, పనిచేసే కేంద్రం ఒకటి లేకపోవడంవల్ల అన్నిరంగాల్లోను పార్టీ పని చాలా కుంటునడిచింది.

ప్రజల్లో మన పలుకుబడి పెరుగుతుండడంవల్ల, బహు ముఖరంగాల్లో పనిచేయవలసిన అవసరం ఏర్పడ్డంవల్ల శ క్తి

సామర్థ్యాలు గల కార్యకర్తలు మనకు చాల అవసర మయారు. ప్రతి రాష్ట్రంలోను యిది అత్యంత క్లిష్టమైన సమస్యగా తయారైంది. మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలను అధ్యయనంచేసి వాటిని నిత్యజీవిత సమస్యలకు వర్తింపజేయగల కార్యకర్తలు చాలమంది లేకపోతే, మనల నేడు రొంటున్న అసంఖ్యాకమైన సమస్యల్లో ఒక్కటీ పరిష్కారం కాదనేది స్పష్టం. కనుకనే, పార్టీ సభ్యుల్ని విజ్ఞానవంతుల నొనర్చడం నేడు చాలా ప్రాధాన్యంగల సమస్యగా తయారైంది. కాని యీ కర్తవ్య నిర్వహణకు ఎట్టిచర్యలూ తీసుకోబడలేదు.

కేంద్రకమిటీ తగిన సన్నాహాలు లేకుండానే సమావేశమవడం తరుచు జరుగుతూవచ్చింది. సరియైన ముసాయిదాలుగాని, ఎజండాగాని వుండదు. ప్రజావుద్యమానికి సంబంధించిన అనేక తక్షణ సమస్యలను కేంద్రకమిటీ చర్చించనే లేదు. అనేక విషయాల్లో అది చేసిననిర్ణయాలు అమలుజరగ లేదు.

సాధారణ ఎన్నికలతర్వాత మనం దేశవ్యాపితంగా ఏ ఉద్యమాన్నీ గట్టిగా నడపలేదు.

ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలు హెచ్చినమాట నిజమే. కాని అఖిలభారత స్థాయిలోను, రాష్ట్ర స్థాయిలోనుకూడా పార్టీ కమిటీలు ట్రేడ్ యూనియన్ రంగంలో పనిచేసే కామ్రేడ్స్‌కి సమిష్టి సూచన లిచ్చి సహాయపడడం కనబడదు. కేంద్రకమిటీ కార్మికోద్యమ సమస్యలను చర్చించనైనా లేదు. కిసాన్ సభ విషయంలోకూడ కేంద్రం ఆ రంగానికి సంబంధించిన సమస్యలను పరిష్కరించేందు కేమీ

చేయలేదు. కిసాన్ రంగంయొక్క పనిని మెరుగుపరచేందుకు 1956 జూన్‌లో చేయబడిన నిర్ణయాలు సైతం కాగితం మీాదనే ఉండిపోయాయి. అనేక రాష్ట్రాలలో కిసాన్‌సభ నిర్మాణం ఎంతో బలహీనంగా ఉంది.

పార్లమెంటులో మనకు సమర్థులైన సభ్యులు చాల మంది ఉన్నప్పటికీ, కొన్ని గట్టి ఉపన్యాసాలు యివ్వడం తప్పితే మన పార్లమెంటరీపని చక్కబడలేదనే చెప్పాలి. సమిష్టినాయకత్వం, కలిసికట్టుగా పనిచేయడం, స్వయంగా అధ్యయనంచేయడం మనలో లోపిస్తూంది.

పార్టీ కేంద్రంనుంచి మనం రెండు పత్రికలు నడుపుతున్నాం. ఒకటి న్యూ ఏజ్ వారపత్రిక, రెండవది న్యూ ఏజ్ మాసపత్రిక. వాటి సంఖ్యావ్యాప్తి తక్కువగా వుంది. వాటిని మెరుగుపరచేందుకు తీవ్రకృషి అవసరం. పదేపదే అడిగినప్పటికీ, పార్టీ నాయకులు పార్టీ పత్రికలకు వ్యాసాలు వ్రాయడం లేదు. వాటిని నడిపేవారే వాటికి బాధ్యత వహించవలసి వస్తోంది. వారిలో అధిక సంఖ్యాకులు జూనియర్ కామ్రేడ్స్. కేంద్రకమిటీ, పొలిట్‌బ్యూరో పార్టీ పత్రికలను గురించి చర్చించడంగాని, వాటిని మెరుగుపరచేందుకు ప్రయత్నించడం గాని కనబడదు.

సాధారణ ఎన్నికలకై ఉద్దేశింపబడిన కరపత్రాలు తప్ప పార్టీ కేంద్రంనుంచి వెలువడిన సాహిత్యం చాల తక్కువ.

ఖర్చులు కొంతవరకు తగ్గినా, పార్టీ కేంద్రం తన కనీసావసరాలకు కూడా ధనం సమకూర్చుకో లేకపోతూంది. పార్లమెంటు సభ్యుల లెవీలమీాద, కొద్దిమంది యిచ్చే విరాళాలమీాద అది పూర్తిగా ఆధారపడుతోంది. అలా విరాళా

లిచ్చేవారి సంఖ్యకూడా పెరగడంలేదు. దీని అర్థం, ప్రతీ యేడూ యిచ్చేవారే మళ్లా యివ్వవలసివస్తోం దన్నమాట అందుచేత, విరాళాలద్వారా వసూలయే మొత్తాలు చాలా వరకు తగ్గిపోయాయి. 1956 జూలైలో రు. 4000 ఉంటే, యీనాడు అవి రు. 2000 కు పడిపోయాయి. పార్లమెంటు సభ్యుల విషయ మేమంటే, వారిలో చాలమంది లెవీలు చెల్లించడంలో బకాయి పడ్డారు.

## రా ష్ట్ర క మి టీ లు

ఈ నివేదికలో రాష్ట్రాల పరిస్థితిని తగినంతగా వివరించడం కష్టం. ఎందుచేతంటే అనేక రాష్ట్రాలనుంచి సరియైన రిపోర్టులు రావడంలేదు; ఒక రాష్ట్రంలోని పరిస్థితులకూ మరో రాష్ట్రంలోని పరిస్థితులకూ వ్యత్యాసంకూడా పెద్దది. రాష్ట్ర కమిటీలు ఎన్నో చిక్కులను, యిబ్బందులను అధిగమించి ఎన్నికల పోరాటంలో దుమికాయి. పార్టీ తరఫున యెన్నో పత్రికలను అవి ప్రచురిస్తున్నాయి. వాటి వ్యాప్తి హెచ్చింది. అనేక పోరాటాలనుకూడా అవి నడిపాయి. ప్రతి రాష్ట్రంలోను మన పలుకుబడి హెచ్చింది. ఇది వరకటికన్న ఎక్కువగా యిప్పుడు పార్టీ విస్తృతమైన రాజకీయ సమస్యలను పరిష్కరించ పూనుకుంటూంది. అనేక రాష్ట్రాల రాజకీయ జీవితంలో మన పార్టీ ఒక ముఖ్యమైన స్థానమలంకరిస్తోంది.

ఐతే, అలాంటి సమస్యలను తీసుకోవడంవల్ల పార్టీ యొక్క సాధారణ పలుకుబడి కొన్నిచోట్ల పెరుగుతూంటే, పార్టీనిర్మాణం, ప్రజాసంఘాలపని, పార్టీ పత్రికల ప్రచురణ,

ప్రజలలో పార్టీ ఆధ్వర్యంక్రింద పార్టీ పేరుతో జరిగే కార్య కలాపాలు - యివి పూర్తిగా నిర్లక్ష్యం చేయబడుతున్నాయి. ఇది చాల ప్రమాదకరమైన పెడమార్గం. త్వరలో దీన్ని సరి దిద్దుకోవలసియుంది.

మొత్తంమీద చూస్తే, పార్టీ కేంద్రంలో నున్న లోపాలే - అంత తీవ్రంగా కాకపోయినా - రాష్ట్ర కమిటీ లలోకూడా ఉన్నాయి. రాష్ట్రకమిటీలు తగినన్ని సన్నాహాలు లేకుండానే సమావేశమవుతున్నాయి. అందుచేత దీర్ఘ చర్చలు తప్పడంలేదు. ఒక్కొక్కప్పుడు సమావేశాలు అస్తవ్యస్తం గాను, అరాజకంగాను జరుగుతాయి; వాటివల్ల ఫలితమేమీ ఉండదు. అనేక తక్షణ సమస్యలు పరిష్కరింపబడకుండా పోతున్నాయి; ఉద్యమాలను గురించి, కార్యకలాపాలను గురించి సమీక్షించుకోడం జరగడంలేదు. అనేక నిర్ణ యాలు కాగితంమీదనే వుండిపోతున్నాయి. ఎందుచేతంటే, వాటిని అమలుజరపడానికి నిర్మాణరీత్యా కావలసిన అనుకూల పరిస్థితులు లేవు. రాష్ట్ర కమిటీలకు, జిల్లా కమిటీలకు మధ్య సంబంధాలు బలహీనంగా వున్నాయి. రాష్ట్రకేంద్రం జిల్లాల సమస్యలను నిర్దిష్టంగా పరిశీలించి సహాయం చేయడం లేదు. రాష్ట్రకమిటీల నాయకులకూ, క్రిందికమిటీల నాయకు లకూ మధ్య వ్యక్తిగత సంబంధాలు తరచు లోపిస్తున్నాయి.

అంతేకాదు. ఇంచుమించు ప్రతి రాష్ట్ర కమిటీలోనూ సమిష్టి కార్యాచరణ, వ్యక్తిగత బాధ్యత, సమిష్టి తనిఖీ (చెకప్) కూడ లోపిస్తున్నాయి. రాష్ట్ర కమిటీ సభ్యులేకాక, అనేకమంది సెక్రెటేరియట్ సభ్యులు సైతం రాష్ట్రాలకు సంబంధించిన పని చేయడంలేదు. బహుకొద్దిమంది కా॥ మేడ్ (

బహువిధ కార్యాలు చేయవలసి వస్తోంది. అదికూడా క్రమ బద్ధంగా కాక, వ్యక్తిగత ప్రాతిపదికమీద జరుగుతోంది.

రాష్ట్ర కమిటీలు అనేక సమస్యలను పరిశీలించడమే లేదు. ఉదాహరణకు, స్థానిక స్వపరిపాలనా సంస్థలలో మనం చేస్తున్న పని ఎంతో ప్రాధాన్యం వహిస్తూన్నప్పటికీ, దాన్ని గురించి రాష్ట్రకమిటీలు ఆలోచించడం లేదు.

పార్టీ సలుకుబడి హెచ్చుతూన్నప్పుడు సహజంగా ప్రజలనుంచి పెద్దయెత్తున పార్టీనిధులు వసూలుచేయ బడుతాయనీ, అదొక ఉద్యమరూపం ధరిస్తుందనీ ఆశిస్తాం. కాని, యీ విషయంలో తగినంతకృషి జరగలేదు. తత్ఫలి తంగా, అన్ని స్థాయిలలోను, అన్ని పార్టీ యూనిట్లలోను ఆర్థికస్థితి క్లిష్టంగా తయారైంది. పార్టీ కార్యకలాపాలను విస్తరింపజేయడం, కనీసం వాటిని ప్రస్తుతస్థాయిలోనైనా కొనసాగించడం అంతకంతకు కష్టమవుతోంది.

పార్టీ సభ్యులకు విజ్ఞానం కలుగజేసే విషయంలోకూడా ఒక్క కేంద్ర కమిటీయేగాక రాష్ట్ర కమిటీలుకూడ చాల తక్కువ శ్రద్ధ చూపుతున్నాయి. పార్టీలో కొత్తగా చేరిన వారి సిద్ధాంత-రాజకీయస్థాయి తక్కువగా వుంది. అంతేకాక ప్రజల్లో పనిచేసే కార్యకర్తల్నెందరినో మనం తయారు చేసుకోవాలి. ఇందుకు వారిని విజ్ఞానవంతుల నొనర్చవలసి యుంది. కాని అలాంటి కృషి లోపిస్తోంది.

మన పార్టీ సభ్యులలో కార్మికవర్గంనుంచీ, రైతాంగం నుంచీ వచ్చిన కామ్రేడ్స్ పెద్ద నిష్పత్తిలో ఉన్నారు. వారిలో అనేకమంది నిరక్షరాస్యులు. కేవలం చదవడం, వ్రాయడం మాత్రమే తెలిసిన మిగతావారు పార్టీ రాజకీయ జీవి

తంలో చురుగ్గా పాల్గొనగలగాలంటే, సిసలైన కార్యకర్తలుగా అభివృద్ధి చెందాలంటే వారికి సాధారణ విద్య కలుగ జేయాలి. పార్టీలో నిరక్షరాస్యతను నిర్మూలించడానికి, పార్టీ సభ్యుల సాంస్కృతిక స్థాయిని పెంచడానికి నడుం బిగించి పని చేయకపోతే, ప్రజల్లో మనం చేయవలసిన పని కుంటువడ్డమే కాకుండా, పార్టీలో ప్రజాస్వామ్యం కూడ పేరుకు మాత్రమే మిగులుతుంది.

## పార్టీలోని బలహీనతలు

ప్రస్తుతం పార్టీలోఉన్న కొన్ని ప్రధాన లోపాలను ఎత్తిచూపడం కూడా అవసరమే. వాటిలో అత్యంత ప్రధాన మైనది పార్టీలో తగినంత ఐక్యత – సిద్ధాంత ఐక్యత, పోరాట పద్ధతులలో ఐక్యత, నిర్మాణ రంగంలోఐక్యత – లోపించడం.

కమ్యూనిస్టుపార్టీకి ప్రధానమైన బలం సిద్ధాంత ఐక్యత. కాని ఇటీవలి సంవత్సరాల్లో యిది చాలా బలహీనమై పోయింది. ఇందుకు ప్రధాన కారణం, కామ్రేడ్స్ మనస్సుల్ని కలవరపెడుతున్న వివిధ సిద్ధాంత సమస్యలపై కేంద్ర కమిటీ తీవ్రమైన ఆంతరంగిక ఉద్యమాన్ని నడపకపోవడం. పాల్ఘాట్ మహాసభలో పార్టీ కార్యదర్శి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ నిర్ణయాలను గురించి రిపోర్టు యిచ్చారు. ఆ మహాసభ యొక్క పత్రాలను అధ్యయనం చేయవలసిం దనీ, కార్యదర్శి యొక్క రిపోర్టును ఆధారంగా చేసుకొని చర్చలు జరపవలసిందనీ పాల్ఘాట్ మహాసభ అన్ని పార్టీ కమిటీలను కోరుతూ ఒక తీర్మానం చేసింది. కాని అది అమలు జరగాలంటే కేంద్ర కమిటీ మరికొన్ని చర్యలుకూడా

తీసుకోడం. కేంద్రకమిటీ సభ్యులు ఏ రాష్ట్రాల్లో పనిచేస్తు న్నారో ఆ రాష్ట్రాల్లో చొరవతీసుకొని రాష్ట్రకమిటీలద్వారా చర్చలను నడపడం అవసరం. కాని ఇది జరగలేదు. తర్వాత కేంద్ర కమిటీ వ్యక్తి పూజకు వ్యతిరేకంగా జరపవలసిన పోరా టాన్ని గురించి ఒక తీర్మానం చేసింది. కాని దీన్ని కూడా పార్టీ యూనిట్లు చర్చించలేదు. ఇందుకు కూడా కారణం సైన చెప్పిందే.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ నిర్ణ యాలను గురించీ, శాంతియుతంగా సోషలిజానికి పరివర్తన చెందే అవకాశంలో గర్భితమైన అర్థాలను గురించీ వివిధ కామ్రేడ్స్ మధ్య పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు ఉత్పన్నమయాయి. సాధారణ ఎన్నికల తర్వాత కేరళలో స్థాపింపబడిన కమ్యూనిస్టు ప్రభుత్వానికి, అంతకంటె చాల విస్తృతమైన శాంతియుత పరివర్తన సమస్యకూ పొత్తుకుదర్చ డానికి ప్రయత్నించుతూ కేరళ కమిటీ ఒక తీర్మానంచేసింది. ఆ డాక్యుమెంటు సరియైనదికాదని కేంద్రకమిటీ సభ్యులలో కొందరు అభిప్రాయపడ్డారు. మరికొందరు దానితో ఏకీభ వించారు. కాని కేంద్ర కమిటీ చర్చించనైనా లేదు.

ఏమైనప్పటికీ ఇవన్నీ ఉదాహరణలు మాత్రమే కాదు. పార్టీలో కీలకమైన సిద్ధాంత సమస్యలయెడ నిర్లక్ష్య వైఖరి ప్రబలుతోంది. కొంతమంది కామ్రేడ్స్ సోషలిస్టు సమాజ నిర్మాణానికి శ్రామిక నియంతృత్వం అత్యవసరమన్న మార్క్సిస్టు లెనినిస్టు మూలసూత్రానికే వ్యతిరేకత తెలియ జేశారు.

ఇంత తీవ్రరూపం దాల్చిన మార్క్సిస్టు వ్యతిరేక భావాలు మన పార్టీలో సర్వసాధారణ మయాయని ఎన్నటికీ చెప్పలేం గాని, అవి ఉన్నాయని మాత్రం మనం గ్రహించాలి. వివిధ రూపాల్లో రివిజనిస్టు అభిప్రాయాలు (మూల సూత్రాలను తలక్రిందులు చేసే ధోరణికి రివిజనిజం అని పేరు- అను.) మన పార్టీలో చొరబడ్డాయి. అదే సమయంలో పిడివాదం కూడా – అంటే కొన్ని మూలసూత్రాలను వల్లించడంవల్ల "సంస్కరణ వాదాన్ని" సృష్టించినట్లు అవుతుందనే వాదనతో పరిస్థితులలో కలిగే మార్పులనుగుర్తించడానికీ సమయోచిత పద్ధతులను అవలంబించడానికీ భయపడడం – ఉంది.

అన్నికమ్యూనిస్టుపార్టీలకార్యకలాపాల్లోనుమార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాల ఆధారంపై సిద్ధాంత సమస్యలను పరిశీలించడ మనేది కీలక ప్రాధాన్యం గల విషయం. పెట్టుబడిదారీ పత్రికలు, పెట్టుబడిదారీ రాజకీయనాయకులు చేసే సిద్ధాంత ప్రచారానికి నిరంతరం ప్రజాసామాన్యమే కాక, పార్టీ సభ్యులు కూడా గురి అవుతూ ఉంటారు. ఉదాహరణకు పంచవర్ష ప్రణాళికవల్ల కలుగబోయే ఫలితాలను గురించి పెట్టుబడిదారీ వర్గం చేస్తూ వచ్చిన ప్రచారప్రభావం ఎన్నికల ముందు దేశం యొక్క రాజకీయ పరిస్థితిని అంచనా వేయడానికి పూనుకున్న కేంద్ర కమిటీమీద ఎలా పడిందో మనం దరికీ తెలుసు. అంతేకాక, మన దేశంలో కులాభిమానాలు, మత భావాలు, రకరకాలైన అభివృద్ధి నిరోధక ధోరణులు చాల లోతుగా పాతుకుపోయి ఉన్నాయి; వాటికి విస్తృతమైన వ్యాప్తి ఉంది. కేంద్ర ప్రభుత్వం భాషా సమస్యపైన, భాషారాష్ట్రాల విషయంలోను అవలంబించిన వైఖరిని

విచ్ఛిన్న శక్తులు, దురభిమానులు తమ స్థానాలను బలపర చుకోడానికి, విచ్ఛిన్న భావాలను ప్రచారం చేయడానికి ఉప యోగించుకోడం జరిగింది. పెటీ బూర్జువా పార్టీలు అతివాద శబ్దాల నుపయోగిస్తూ సోవియట్ యూనియన్‌ని నిందిస్తు న్నాయి; శాంతి ఉద్యమాన్ని అపహాస్యం చేస్తున్నాయి; మన పార్టీని గురించి అబద్ధాలు ప్రచారం చేస్తున్నాయి.

అందుచేత, సిద్ధాంత రంగంలో మనం నిర్వర్తించవల సిన కర్తవ్యాలు చాల పెద్దవి; అవి అంతకంతకు అధికమవు తున్నాయి కూడా. వాటిని నిర్వర్తించనిదే మనం ప్రజల్ని ఐక్యపరచలేం; వారికి నాయకత్వం వహించలేం. వాటి విష యంలో ఉపేక్ష వహిస్తే, మనల్ని అనుసరించే ప్రజల్లోను, పార్టీలోను కూడా అన్యవర్గధోరణులు అనివార్యంగా ప్రవే శిస్తాయి. అందుచేత మన కార్యకర్తల్లో మార్క్సిస్టు - లెనినిస్టు చైతన్యాన్ని పటిష్ఠమొనర్చాలి. ప్రజల్ని వేధిస్తూన్న అన్ని విషయాలపైన సిద్ధాంత విషయిక, విద్యావిషయిక సామాగ్రిని తయారుచేసిపెట్టాలి. కాని వీటన్నిటి విషయంలో బహు స్వల్పంగా మాత్రమే కృషి జరిగింది. ఒకవైపు పార్టీ యొక్క పలుకుబడి విస్తరించింది; కాని మరోవైపు పార్టీ సభ్యుల మార్క్సిస్టు - లెనినిస్టు చైతన్యం తగ్గింది.

శ్రామికవర్గ అంతర్జాతీయతా భావం మొత్తం పార్టీ లోనే బలహీనపడింది. ప్రపంచ శాంతిని కాపాడ్డానికి, సోవియట్ చైనా దేశాలతోను, తదితర సోషలిస్టు దేశాల తోను స్నేహసంబంధాలను పెంపొందించుకోడానికి, ఆసియా - ఆఫ్రికా దేశాలమధ్య ఐక్యతను పటిష్ఠమొనర్చడానికి మన

పార్టీ చేస్తున్న కృషి బహుస్వల్పం. దీన్నిబట్టి మనలో శ్రామిక వర్గ అంతర్జాతీయత ఎంతగా లోపిస్తూందో తెలుసుకోవచ్చు.

గత రెండు సంవత్సరాల్లో ఎత్తుగడల విధానంమీద పార్టీలో చాలవరకు రాజకీయ ఐక్యత సిద్ధించిందనే చెప్ప వచ్చు; అయితే అది తగినంత పటిష్ఠంగాలేదు.

మన ముందున్న భవిష్యదవకాశాలను గురించి, శాంతి యుత పద్ధతులద్వారా సోషలిస్టు పరివర్తన సాధ్యమవడంలోని లోతుపాతులను గురించి, ఐక్యసంఘటన నిర్మాణానికి అవలం బించవలసిన ఎత్తుగడలను గురించి, ఇంకా అనేక ప్రధాన సమస్యలను గురించీ — స్పష్టమైన అవగాహనగాని, ఏకాభి ప్రాయంగాని పార్టీలో లేదు. ఇందుకు ప్రధానకారణం ఒక్కటే: కేంద్ర కమిటీ యీ సమస్యలను శ్రద్ధతో చర్చించి, ఏకాభిప్రాయాన్ని రూపొందించడంలో విఫలమయింది.

పార్టీలో రాజకీయ ఐక్యత యేర్పడ్డమంటే, పాల్ఘాట్ మహాసభలో మనంచేసినలాంటి సాధారణ రాజకీయతీర్మానాల ఆధారంమీద ఒక్కసారిగా ఐక్యత సిద్ధించడంకాదు. సరియైన విధానంపై ఆధారపడు ఐక్యత సైతం పాక్షికమైనదిగానే ఉంటుంది. అసలు విషయమేమంటే, ఆ విధానాన్ని మనం ప్రజల జీవిత సమస్యలకు వర్తింపజేయాలి; దానికొక నిర్దిష్ట రూపం యివ్వాలి; ఎప్పటికప్పుడు దాన్ని అభివృద్ధి చేస్తూ ఉండాలి. పార్టీయొక్క సాధారణ రాజకీయ విధానాన్ని నిర్విరామంగా అప్పటప్పటి సమస్యలకు వర్తింపజేయకపోతే కార్మిక కర్షక తదితర వర్గాల ప్రజలల్లో నిర్వర్తించవలసిన కర్తవ్యాల రూపేణా దానికి నిర్దిష్టరూపం ఇవ్వకపోతే, ప్రజాఉద్యమం యొక్క ప్రత్యక్షానుభవాన్ని అర్థం

చేసుకుని జీర్ణించుకోడంద్వారా దాన్ని పరిపుష్టమొనర్చక పోతే—అందరూ తలోక విధంగానూ దాన్ని అర్థంచేసుకోడం తప్పదు; దానివల్ల పార్టీఐక్యత బలహీనపడుతుంది. ఒండొరుల మధ్య ఉత్పన్నమయే అభిప్రాయభేదాలు ఘనీభవిస్తాయి. విభిన్న రాజకీయ ధోరణుల ఆధారంమీద, పార్టీ విధానాన్ని గూర్చిన విభిన్న అవగాహనల ఆధారంమీద పార్టీలో గ్రూపులుకూడా బయల్దేరుతాయి.

కనుకనే పార్టీని ఐక్యపరచేందుకు జరిగే కృషిలో పై కమిటీలకు క్రింది కమిటీలు, క్రింది కమిటీలకు పై కమిటీలు రిపోర్టులు యివ్వడం; నాయకత్వ కమిటీలు ప్రజలతో సన్నిహిత సంబంధాలుంచుకోవడం; పార్టీ నడిపిన పోరాటాలను గురించీ, ఉద్యమాలను గురించీ, కార్య కలాపాలను గురించీ ఎప్పటికప్పుడు సమీక్షించుకోడం; ప్రజాసమస్యలను ఎప్పటికప్పుడు చర్చించడం; అనుభవాలనుంచి పాఠాలు నేర్చుకోడం—యివి చాలా ప్రాధాన్యం వహిస్తాయి.

కాని, యీ విషయాలన్నిటిలోను మనం చేయవలసినదెంతో ఉండగా, చేసింది బహుస్వల్పం మాత్రమే. అందుచేత పార్టీలో రాజకీయ ఐక్యత పాక్షికంగామాత్రమే సిద్ధించింది.

నిర్మాణసమస్యల్లోకూడా ఐక్యత అసంతృప్తికరంగానే వుంది. పార్టీ కేంద్రంయొక్క, రాష్ట్ర కమిటీలయొక్క పనిని గురించి ప్రస్తావించే సందర్భంలో యీ విషయం స్థూలంగా చర్చింపబడింది. ప్రస్తుతం కొన్ని విషయాలను నొక్కి చెప్పడం మాత్రం అవసరం. అవి యివి :

— "గ్రూపు తత్వం," ఫెడరల్ తత్వం, స్థానిక తత్వం వంటి విచ్ఛిన్నపోకడలు మన పార్టీలో బయల్దేరాయి.

— క్రిందినుంచువచ్చే సూచనలయెడ, విమర్శలయెడ పెత్తందారీ నిర్లక్ష్యమనేది మన పార్టీ జీవితంలో ఒక స్వభావ సిద్ధమైన లక్షణంగా తయారైంది.

— రాజకీయ ధోరణులమీద, చివరకు వ్యక్తిగత స్నేహాలమీద ఆధారపడి పార్టీలో గ్రూపులు ఏర్పడు తున్నాయి. అయితే, యిది రెండు సంవత్సరాలనాడున్నంత తీవ్రంగా యిప్పుడు లేదు.

— అన్నిటికంటె ప్రధానంగా, వ్యక్తిగత అహంభావం మనలో బలిసింది; క్రమశిక్షణ సడలింది. దీనికి సంబంధించి సంతవరకు బాధ్యతగల స్థానాల్లోవున్న నాయకులే చాల సందర్భాల్లో అందరికంటె పెద్ద నేరస్థులు.

మన పార్టీలో సభ్యుల సంఖ్య తక్కువ. వీరిలో కూడ అనేకమంది ఎన్నికలు, మహాసభలకు సన్నాహాలు మొదలైన సందర్భాల్లో తప్ప, మిగతా సమయాల్లో ఏ పనీ చేయరు. వివిధ వృత్తులలో ఉన్న కామ్రేడ్స్ పార్టీ పనుల్లో తమ పాత్రను తాము సక్రమంగా నిర్వహించేటట్లు పార్టీ కార్యకలాపాల్లో వారు చురుగ్గా పాల్గొనేటట్లు వివిధరంగాల పనిని మనం క్రమబద్ధమొనర్చ లేకపోతున్నాం. సాధారణ సమయాల్లో యించుమించు పార్టీ పని అంతా హోల్‌టైమ్ కార్యకర్తలే చేస్తున్నారు. ఇందు వల్ల మొత్తం పార్టీ సభ్యత్వం రెండు తరగతులుగా విభ జింపబడిపోయింది; చురుగ్గా పనిచేసే హోల్‌టైమర్లు మొదటి తరగతి క్రిందికి వస్తారు; పనిచేయని పార్ట్‌టైమర్లు రెండవ తరగతి క్రిందికి వస్తారు. అంతేకాదు; మన పార్టీలో కొందరు కామ్రేడ్స్ బొత్తిగా పనిచేయడంలేదు; ఏ పార్టీపనీ వారికి

సరిపడదు; పార్టీకి సంబంధించిన ఒక్క బాధ్యతకూడా వారు నిర్వర్తించరు; పైగా హక్కులను మాత్రం అన్నిటినీ పొందా లంటారు; కేవలం విధ్వంసక విమర్శలే వారు చేస్తూ ఉంటారు; పార్టీకి వ్యతిరేకంగా నిందారోపణలుకూడ వారు చేస్తూ ఉంటారు.

ప్రధానంగా హోల్‌టైమర్ల మీదనే ఆధారపడుతూ చేసే పాతకాలపు పని విధానాన్ని మనం పూర్తిగా మార్చు కోవాలి; సాధారణ సభ్యులచేత అంతకంతకు అధికంగా పని చేయించే విధాన మవలంబించాలి. అదే సమయంలో పార్టీ పలుకుబడి అంతకంతకు అధిక మవుతూండడంవల్ల, పార్టీ కార్యకలాపాలు బహుముఖ రంగాలకు విస్తరిస్తూండడంవల్ల హోల్‌టైమర్ల సంఖ్యకూడా పెరుగుతూ ఉండాలి. కాని యిటీ వలి సంవత్సరాల్లో మన హోల్‌టైమ్ కార్యకర్తల సంఖ్య పెరగనే లేదు. పైగా అనేక రాష్ట్రాల్లో అది తగ్గిపోయిందికూడ. వారి కనీస అవసరాలను పార్టీ తీర్చ లేకపోతూంది. అందుచేత చాలమంది హోల్‌టైమర్లు పార్టీ పనిని విడిచిపెట్టి ఉద్యోగాలు చూచుకొంటున్నారు. ఇందువల్ల పార్టీ పని ఎంతో కుంటుపడ్డ మేకాక, పార్టీయొక్క అమూల్యమైన సంపద — అంటే, కార్య కర్తలు, వారి దీర్ఘానుభవం — అక్కరకు రాకుండా పోతు న్నాయి.

ఈ విధంగా, పార్టీలో సిద్ధాంత గందరగోళం ఏర్పడ్డం వల్లను, మార్క్సిస్టు — లెనినిస్టు సిద్ధాంతాల్లో తగినంత పరి జ్ఞానం లేకపోవడంచేతను, రాజకీయ — నిర్మాణ బలహీనతల వల్లను పార్టీలో అన్యవర్గ భావాలు, పద్ధతులు, అల

వాట్లు ప్రబలంగా వ్యాపించాయి. అందువల్ల పార్టీయొక్క నైతిక ప్రమాణాలు సన్నగిలుతున్నాయి.

మనం అనేక సంవత్సరాలుగా అపసవ్యపద్ధతుల్లో పార్టీ ఆంతరంగిక పోరాటం జరపడంకూడా పైన పేర్కొన్న లోపాలు తీవ్రరూపం దాల్చడానికి ముఖ్య కారణమయింది.

ఒక సంవత్సరంనుంచి పరిస్థితి కొద్దిగా చక్కబడుతున్నప్పటికీ, అనేక పార్టీ యూనిట్లలో-ముఖ్యంగా అనేక నాయకత్వ సంస్థల్లో-అనారోగ్యకరమైన వాతావరణం వ్యాపించియుంది. ఒకప్పుడు తమతో భేదించిన కామ్రేడ్స్ యీనాడు న్యాయ సమ్మతమైన విమర్శన చేసినప్పటికీ, కొంతమంది కామ్రేడ్స్ దాన్ని సహించజాలకున్నారు; వారి లోపాలయెడ మరీ తీవ్రమైన వ్యతిరేకత ప్రదర్శిస్తున్నారు. రెండో వైపున యితర కామ్రేడ్స్ లోపాలను చూచీచూడనట్లు ఉదార వైఖరి నవలంబిస్తున్నారు.

## తప్పుల దిద్దుబాటుకు ప్రాతిపదిక

పై లోపాలు అనేకరాష్ట్ర మహాసభల్లో చర్చించబడ్డాయి. కాని ప్రస్తుతం కావలసింది వాటన్నిటనీ ఏకరువు పెట్టడంకాదు. వాటిని తొలగించుకోవడానికి కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవాలి. ఇది చాలాకష్టంతో కూడినపని; దాన్ని పూర్తి చేయడానికి చాలకాలం పడుతుంది. అయితే వెంటనే దాన్ని ప్రారంభించడం మాత్రం అవసరం; ఇందుకు మనం పూనుకోకపోతే దేశంపట్ల, ప్రజలపట్ల మనం నిర్వర్తించవలసిన విధులను నిర్వర్తించలేకపోతాం; ఇంతవరకు మనం సాధించిన విజయాలను పటిష్ఠ మొనర్చుకోలేక పోతాం; ప్రజాతంత్ర విప్లవంయొక్క, సోషలిజం యొక్క అసంపూర్ణంగా

వుండిపోయిన కర్తవ్యాలను పూర్తి చేసేందుకు సాగించవలసిన పోరాటంలో ప్రజలకు నాయకత్వం వహించ లేక పోతాం. పై బాధ్యతలను నిర్వహించ లేకపోతే మనం కార్మిక వర్గం యొక్క ప్రజాపార్టీగా అభివృద్ధి చెందజాలం.

ఈ లోపాలను తొలగించుకు నేందుకు నేడు పరిస్థితులు అనేక విధాలుగా అనుకూలంగా వున్నాయి.

ఇటీవల 12 దేశాల కమ్యూనిస్టుపార్టీలు అంతర్జాతీయ పరిస్థితిని గురించి యెంతో ప్రతిభావంతంగా వివరిస్తూ చేసిన సంయుక్త ప్రకటన చారిత్రక ప్రాధాన్యంగల పత్రం. అనేక ప్రధాన సమస్యలపైగల గందరగోళాన్ని అది తొలగించింది; అన్ని దేశాల కమ్యూనిస్టుపార్టీలు రివిజనిస్టు ధోరణులకూ, పిడివాద ధోరణులకూ వ్యతిరేకంగా దృఢనిశ్చయంతో పోరాడేందుకు చక్కని సాధనాలను అది యిచ్చింది.

కార్మికవర్గంలోను, ప్రజా సామాన్యంలోను మన కిప్పుడున్నంత బలం యిదివరకెన్నడూ లేదు. ప్రజల్లో మన పలుకుబడి హెచ్చింది. మన ప్రతిష్ట అంతకంతకు విస్తృత మవుతోంది.

పార్టీయొక్క ఆంతరంగిక పరిస్థితికూడా అనేక విషయాల్లో చక్కబడుతూంది.

సాధారణ ఎన్నికల్లో మనంసాధించిన విజయాలవల్లను, నానాటికి వృద్ధిచెందుతున్న మన పలుకుబడివల్లను పార్టీ యొక్క రాజకీయ విధానం సరియైనదని సుజునవడమే గాక, గతంలో ఉత్పన్నమైన అనేక రాజకీయ వివాదాలు పరిష్కారమై, రాజకీయ ఐక్యతకు అనుకూల పరిస్థితు లేర్పడ్డాయి.

ప్రజల్లో మన మొత్త విశిష్టస్థానం సంపాదించడంవల్ల

మనమీద ఎన్నో గురుతరమైన బాధ్యతలు పడ్డాయన్న చైతన్యం, వాటిని నిర్వహించేందుకు పార్టీని బలపరచుకోవాలన్న భావం మొత్తం పార్టీలో యీనాడుంది. ఈనాడు మన దేశంలో ఏ పార్టీకీ లేనంత ఉత్తమమైన కార్యకర్తలు ఉన్నారు. వారు పార్టీలోఉన్న లోపాలను తొలగించేందుకు, పార్టీని సరియైన పద్ధతుల్లో రూపొందించేందుకు కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవాలన్న కాంక్షను వెల్లడించడమేగాక అట్టి చర్యలను ఆహ్వానిస్తారుకూడ.

ఇవన్నీ మన కనుకూలమైన పరిస్థితులే. వీటి ప్రాధాన్యాన్ని మనం గమనించాలి. వీటి ఆధారంమీద మనం పురోగమించాలి.

మనలో వున్న లోపాలను పైన వివరించాం. అవి చాల తీవ్రమైనవే. అయినప్పటికీ మనం దినదినాభివృద్ధి చెందామంటే దానికి కారణం మన పార్టీయొక్క మూల స్వభావమే.

భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ మొదటినుంచీ మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాల ననుసరించి పనిచేస్తూ వచ్చింది కనుకనే అది నేటి యీ స్థానాన్నాక్రమించ గలిగింది.

శ్రామికవర్గ అంతర్జాతీయత సూత్రాలపై ఆధారపడి పనిచేయడంవల్లనే మన మింతగా అభివృద్ధి చెందాం. నిర్దిష్టమైన భారతదేశ పరిస్థితులను అధారం చేసుకొని మన విధానాలను రూపొందించుకొంటూ, సుమారు నూరు సంవత్సరాల ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంయొక్క అనుభవాన్నుంచి గుణపాఠాలు నేర్చుకోడానికి మన

పార్టీ ప్రయత్నిస్తూ వచ్చింది. ప్రపంచంలో మూడవ వంతు జనసంఖ్య నివసించే ప్రాంతంలో అఖండ విజయం సాధించిన ప్రపంచ మహోద్యమంలో మన మొక భాగం. శాంతికొరకు, ప్రజాస్వామ్యంకొరకు, సోషలిజం కొరకు, నూతన జీవితం కొరకు, మానవజాతి సాగిస్తున్న పోరాటానికి నాయకత్వంవహించే ఆ మహోద్యమంలో మనం కూడా భాగస్వాములమే.

మనపార్టీ నిర్భయంగా ప్రజల ఆశయాలను బలపర చింది. వారిపోరాటాలకు నాయకత్వంవహించింది. వారి సంఘా లను నిర్మించింది. కనుకనే అది నేడున్న స్థానమాక్రమించ గలిగింది.

మన పార్టీ ప్రధానంగా పునాది వర్గాలైన కార్మికుల మీద, రైతులమీద ఆధారపడుతూ వచ్చింది. కనుకనే అది నేడున్న స్థాన మాక్రమించగల్గింది.

మన పార్టీ ప్రజాస్వామ్యయుత కేంద్రీకృతాధికార సూత్రంమీద నిర్మింపబడింది. అనేక లోపాలున్నప్పటికీ దేశంలోకల్లా ఎక్కువ క్రమశిక్షణగల పార్టీ మనదే. కనుకనే అది నేడున్న స్థానమాక్రమించగలిగింది.

మన విజయాలు కాకతాళీయంగా లభించినవి కావు; ఏదో ఒక్క కారణంవల్లనే కూడా అవి లభించలేదు.

మన విజయాలు మార్క్సిజం – లెనినిజం యొక్క విజయాలు; శ్రామికవర్గ అంతర్జాతీయతయొక్క విజయాలు. పార్టీకి మూలాధారాలుకూడా అవే. మనం అనేక ప్రజా పోరాటాల్లో పాల్గొనడంవల్ల, వాటికి నాయకత్వం వహించడం వల్ల, ప్రజల హక్కులకోసం నిర్భయంగా పోరాడ్డంవల్ల,

కార్మికులమీద, రైతులమీద ఆధారపడ్డంవల్ల — మనం యీ విజయాలు సాధించాం. అన్ని ప్రాంతాల్లోను, అన్ని తరగతుల్లోను ఉండే మన కామ్రేడ్స్, మన మిత్రులు, మన అభిమానులు కలిసి పనిచేయడంవల్ల యీ విజయాలు లభించాయి. అనేక తరాల కమ్యూనిస్టులు పార్టీకోసం నిర్విరామంగా పనిచేశారు; అనేక బాధలు అనుభవించారు; ఎనలేని త్యాగాలుచేశారు; వేల సంఖ్యలో ప్రాణాలను సైతం అర్పించారు. వారి సమిష్టి కృషివల్లనే యీ విజయాలు లభించాయి.

వీటన్నిటివల్ల మనం ప్రజా జీవితంలో ఒక ప్రధాన స్థానమాక్రమించాం. మన పార్టీ యిచ్చిన అనేక నినాదాలు ప్రజాతంత్ర ఉద్యమమంతటియొక్క నినాదాలుగా పరిణమించాయి. లక్షలాది ప్రజలు మన నాయకత్వంకోసం ఎదురు చూస్తున్నారు; తమ ఆశలు, ఆశయాలు మనలో మూర్తీభవించినట్లు వారు గుర్తిస్తున్నారు.

మన పార్టీ ఇప్పుడున్నంత పెద్దశక్తిగా యిదివరకెన్నడూ లేదు. ప్రజాతంత్ర ఉద్యమంయొక్క భవిష్యత్తు, దేశభవిష్యత్తు మన పార్టీ నిర్వహించబోయే పాత్రమీద ఆధారపడివుంది; దీని కిప్పుడున్నంత ప్రాధాన్యత యిదివరకెప్పుడూ లేదు.

ఇట్టి చైతన్యంతో మనం కమ్యూనిస్టుపార్టీని కార్మికవర్గం యొక్క ప్రజా పార్టీగా నిర్మించేందుకు, మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలకు ఖచ్చితంగా కట్టుబడి పనిచేసే పార్టీని నిర్మించేందుకు, నిరంతరం ప్రజలమధ్య జీవిస్తూ ప్రజా ఉద్యమాన్ని విజయోన్ముఖంగా నడపగల పార్టీని నిర్మించేందుకు - పనిచేద్దాం.

# పార్టీ నిర్మాణంపై తీర్మానం

[ 1958 ఏప్రిల్ 6 నుండి 13 వరకు అమృత్‌సర్‌లో జరిగిన భారత కమ్యూనిస్టుపార్టీ ప్రత్యేక మహాసభ పార్టీ నిర్మాణాన్ని గురించి చేసిన తీర్మానం. ]

భారత కమ్యూనిస్టుపార్టీ యీనాడు మన దేశ రాజకీయ జీవితంలో ఒక ప్రధాన శక్తిగా ఆవిర్భవించింది. పార్లమెంటులోను, పశ్చిమబెంగాల్ ఆంధ్రశాసనసభల్లోను ప్రధాన ప్రతిపక్షంగా వుంది. కేరళ రాష్ట్రంలో ప్రభుత్వాన్ని నడుపుతూంది. ఇక కార్మిక వర్గంలో అన్నిటికన్న బలమైన ఏకైక పక్షం కమ్యూనిస్టుపార్టీయే. దేశం నలువైపుల కమ్యూనిస్టు పార్టీ పలుకుబడి పెరుగుతూంది. ఇటీవలి మాసాల్లో పార్టీ సభ్యత్వం రెట్టింపయింది.

అయితే, సిద్ధాంత - రాజకీయ - నిర్మాణ రంగాల్లో యిప్పటికీ ప్రమాదకరమైన కొన్ని లోపాలున్నాయి. వాటిలో కొన్ని నిర్మాణ నివేదికలో వివరింపబడ్డాయి. ప్రత్యేక మహాసభలో ప్రసంగించిన ప్రతినిధులంతా వాటిని గురించి, తదితర లోపాలను గురించి నొక్కిచెప్పారు.

ఈ లోపాలను తొలగించుకోనిదే పార్టీ తన ముందున్న గురుతర బాధ్యతలను నిర్వర్తింపజాలదనే విషయం స్పష్టం. అందుచేత వాటిని తొలగించుకోడానికి, పార్టీ ఐక్యతను పటిష్ఠ మొనర్చడానికి, ప్రజాకమ్యూనిస్టుపార్టీని రూపొందించడానికి కట్టుదిట్టమైన, అవిరళమైన చర్యలు తీసుకోవలసియుంది.

అన్ని పార్టీ యూనిట్లు యీ కర్తవ్యాన్ని నెరవేర్చేందుకు తక్షణమే శ్రద్ధవహించవలసి యుంది. కాని కీలకపాత్ర వహించవలసింది మాత్రం కేంద్ర యూనిట్లు అయిన జాతీయ సమితి, కేంద్ర కార్యనిర్వాహకవర్గం, కేంద్ర సెక్రటేరియటు. ఈ యూనిట్లు నిర్వర్తించవలసిన సాధారణవిధులు పార్టీ నిబంధనావళిలో పేర్కొనబడ్డాయి. వాటిలో కొన్నిటికి తొలి ప్రాధాన్యత యివ్వవలసియుంది.

## కేంద్ర సంస్థల విధులు

1. అన్నిటికంటె ముఖ్యమైన కర్తవ్యం పార్టీ సభ్యులకు విజ్ఞానం కలిగించడం. అలా చేస్తేనే పార్టీలో ఉన్నత, మధ్య శ్రేణులకు చెందిన నాయకత్వంలో సమైక్య దృక్పథం, సమైక్య ఆచరణ సాధ్యమవుతాయి; కార్యకర్తల్ని అభివృద్ధి చేసే విషయంలో మనం ప్రాథమికచర్యలు తీసుకొన్నవార మవుతాం. కేంద్ర నాయకత్వం పాఠ్యక్రమాన్నొకదానిని తయారుచేసి, వివిధ రాష్ట్రాల్లోను ప్రాంతాల్లోను పార్టీ విద్యాలయాలను నడపడంలో సహాయపడవలసియుంది.

2. పార్టీయొక్క సిద్ధాంత-రాజకీయ స్థాయిని పెంచడానికి 'న్యూఏజ్' మాస పత్రిక ముఖ్యపాత్ర వహించవలసియుంది. ఆర్థిక రాజకీయ పరిణామాలను గురించీ, ప్రజా ఉద్యమాలనుంచి నేర్చుకోవలసిన పాఠాలను గురించీ, పార్టీ నిర్మాణాన్ని గురించీ, సిద్ధాంత సమస్యలను గురించీ బాగా అధ్యయనంచేసి వ్రాసిన చక్కని వ్యాసాలను ప్రచురించవలసియుంది.

'న్యూ ఏజ్' వారపత్రికను మెరుగుపరచేటందుకు కేంద్ర నాయకత్వం తగు చర్యలు తీసుకోవాలి.

ప్రస్తుత పరిస్థితుల్ని గురించి, ప్రధానసమస్యల్ని గురించి ప్రచురణలు తీసుకురావడానికి కూడా కేంద్రం తగు ఏర్పాట్లు చేయాలి.

3. జాతీయసమితి అన్నిఏర్పాట్లూ చేసుకొని సమావేశమవుతూండడం, కేంద్రకార్యనిర్వాహకవర్గం నిర్ణీత సమయాల్లో తప్పనిసరిగా కలుసుకొంటూండడం ద్వారా పార్టీ ఎప్పటికప్పు డెదురయ్యే సమస్యలపై పరిష్కారమార్గం చూపుతూ ఉండాలి.

4. ప్రధాన రాజకీయ సమస్యలపై కేంద్ర కార్య నిర్వాహకవర్గం, సెక్రటేరియటు పార్లమెంటరీ కార్యవర్గాన్ని నడుపుతూ ఉండాలి. పార్లమెంటుసభ్యుల క్రమశిక్షణవగైరా సమస్తమైన పార్లమెంటరీ కార్యకలాపాలకు బాధ్యత వహించ వలసింది పార్లమెంటరీ కార్యవర్గమే.

5. ట్రేడ్ యూనియన్ రంగానికి చెందిన నాయకులతో ఒక ఉపసంఘాన్ని నిర్మించాలి.

6. రైతాంగంలోను, వ్యవసాయ కూలీల్లోను పార్టీ చేయవలసిన పని అత్యంత ప్రాధాన్యం వహిస్తూండడంవల్ల, పార్టీ చిరకాలంనుంచీ యీ రంగాలను నిర్లక్ష్యం చేస్తూండడం వల్ల రైతు రంగానికి చెందిన నాయకులతో ఒక ఉపసంఘాన్నేర్పరచాలి; కేంద్రం రైతు సంఘాల, వ్యవసాయ కూలీ సంఘాల పునర్నిర్మాణానికి ప్రత్యేక ప్రాధాన్యత నివ్వాలి.

7. పార్టీ యూనిట్లు శాంతి ఉద్యమంపట్ల ప్రదర్శిస్తున్న నిర్లక్ష్యాన్ని తొలగించేందుకు శక్తివంతమైన చర్యలు తీసుకోవాలి.

8. స్త్రీలు, విద్యార్థులు, యువజనులలో చేయవలసిన పనిని సమగ్రవంతంగా సంఘటితపరచాలి. ఈ విషయంలో రాష్ట్ర కమిటీలు, జిల్లా కమిటీలు గట్టిగా శ్రద్ధవహించాలి. పార్టీ పనికి సహాయంచేయడానికి, ఉమ్మడి సమస్యలను చర్చించి విధానాలను రూపొందించడానికి పార్టీ కేంద్రం యీ రంగాల్లో పనిచేసే నాయకులతో సమావేశాలు జరపాలి; అవసరమైన, సాధ్యమైన ప్రదేశాల్లో ఉపసంఘాలను నిర్మించాలి.

9. కేంద్రానికీ, రాష్ట్రాలకూ గల సంబంధాన్ని పటిష్ఠ మొనర్చవలసిన అవసరం చాలా ఉంది. కాని వెన్వెంటనే కొన్ని చర్యలను మాత్రమే తీసుకోగలం. ఉదాహరణకు ప్రధాన కార్యదర్శి, కార్యనిర్వాహకవర్గ సభ్యులు, సెక్రటేరి యట్ సభ్యులు దఫాలవారీగా రాష్ట్రాలకు వెళ్తూఉండాలి; రాష్ట్ర కమిటీలు పంపే నివేదికలను క్షుణ్ణంగా అర్థంచేసు కొంటూ ఉండాలి; ఆ కమిటీ లడిగే ప్రశ్నలకు సకాలంలో జవాబులిస్తూ వుండాలి; పెద్ద సమస్యలు ఉత్పన్నమైనప్పుడు, కేంద్రం పరిష్కారమార్గం చూపవలసి వచ్చినప్పుడు అది జోక్యం కలుగజేసుకొంటూ వుండాలి.

హిందీభాష మాట్లాడే ప్రాంతాల్లో మన ఉద్యమం బలహీనంగా ఉంది. కేంద్రం ఆ ప్రాంతాలమీద ప్రత్యేక శ్రద్ధ చూపాలి. హిందీ, ఉర్దూ వారపత్రికల స్థాపనకు కేంద్రం తగుచర్యలు తీసుకోవాలి.

రాష్ట్రాలకు సంబంధించిన ప్రధాన సమస్యలను చర్చించి. వాటిని పరిష్కరించడానికి కేంద్రం సహాయపడాలి. ఇందుకు కేంద్రస్థాయి పెరియటు రాష్ట్రస్థాయి పేరియట్ల సమావేశాలకు కార్యక్రమం తయారు చేయాలి.

10. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాల్ని భారత దేశం యొక్క వాస్తవ పరిస్థితులకు వర్తింపజేస్తూ, భవిష్యత్తును గురించిన విస్పష్ట రూప చిత్రణతో మొత్తం పార్టీని సాయుధ మొనర్చే ఒక కార్యక్రమం మనకు అనేక సంవత్సరాలనుంచి లేదు. ఈ పరిస్థితి మన సిద్ధాంత గందరగోళాన్ని తీవ్రపర్చింది. అందుచేత, పార్టీకి ఒక ముసాయిదా కార్యక్రమాన్ని తయారు చేయవలసియుంది. దాన్ని జాతీయ కౌన్సిలు పార్టీకంతకూ పంపుతుంది. అన్ని పార్టీ యూనిట్లు దానిని చర్చించవలసిన అవసరం వుంది.

11. మన పార్టీ స్థాపింపబడినతర్వాత అది సాధించిన విజయాలను గురించి, చేసిన పొరబాట్లనుగురించి పార్టీలో ఏకాభిప్రాయంలేదు. వివిధ దశల్లో సభ్యులుగా చేరిన కామ్రేడ్స్ ప్రతిదశలోను పార్టీ ఏవిధంగా అభివృద్ధిచెందింది? ఏయే విజయాలను సాధించింది? వేటిని సాధించలేక పోయింది – అనే విషయాలపై ఎవరి అభిప్రాయాలను వారు కలిగియున్నారు; ఎవరి అవగాహన వారికుంది. జాతీయోద్యమంలో కమ్యూనిస్టుపార్టీ నిర్వహించవలసిన పాత్రను గురించి అనేక అసత్యాల, అర్థసత్యాల ఆధారంపై వ్యాప్తిలోకి వచ్చిన కొన్ని అపసవ్యభావాలు మన అభిమానుల్లోనేకాక సభ్యుల్లో కూడా ఉన్నాయి.

మన పార్టీ మొదటినుంచీ సాగిస్తూవచ్చిన మొత్తం కృషివల్లనే పార్టీ ప్రస్తుత దశకు చేరుకోగలిగిందని పైన చెప్పబడింది. కాని అదొక్కటే పూర్తి సత్యంకాదు. మన పార్టీ యొక్క చరిత్రనుగురించి, దాని గత కార్యకలాపాలగురించి ఒక ఐక్య అవగాహన వుండాలి. ఈ రోజున యిది చాలా అవసరం. ఇందుకు పార్టీ పూనుకోవాలి. అయితే యిది కష్టంతో కూడుకొనియున్న పని; ఇది పూర్తి కావడానికి కొంత కాలం పడుతుంది. అయినా సాధ్యమైనంత త్వరలో దీన్ని ప్రారంభించడం మాత్రం అవసరం. ఇందుకు పార్టీ డాక్యుమెంట్లన్నిటినీ సేకరించడం, వివిధ దశల్లో ప్రముఖ పాత్ర వహించిన పార్టీ నాయకులు సమిష్టిగా చర్చించుకోడం ఎంతేని అవసరం.

12. కేంద్ర కార్యాలయంలోను, కేంద్రానికి సంబంధించిన వివిధ శాఖల్లోను పనిచేసే కార్యకర్తల పనివిధానాన్ని సంఘటితపరచి, అక్కడ పార్టీనిర్మాణం ఏ విధంగా ఉండాలో నిర్ణయించాలి.

పార్టీ కేంద్రం ఏర్పరచబోయే వేర్వేరు ఉపసంఘాలు ప్రజాసంఘాల కమిటీలను త్రోసిరాజనవు; అలాగే వివిధ రాష్ట్రాలలో ఏర్పడబోయే ఉపసంఘాలకు అవి ఆదేశాలివ్వడం కూడా జరగదు. వాటిపని అల్లా సమస్యలను అర్థంచేసుకోడంలో కేంద్రానికి సహాయపడ్డం; రాష్ట్ర కమిటీలద్వారా కేంద్రం ప్రజాసంఘాల పనిని నడపడం.

# కేంద్ర సంస్థల పనివిధానం

సమిష్టి పనివిధానం, నిర్ణయాలను అమలుజరపడంలో వ్యక్తిగత బాధ్యత, నిర్ణీతసమయాల్లో సమిష్టి తనిఖీ (చెకప్) అనే సూత్రాన్ని ఆధారంగా చేసుకొని సెక్రటేరియట్ సభ్యులు తమలోతాము పనివిభజన చేసుకుంటారు. ఇప్పుడు అమలుజరుగుతూన్న వ్యక్తిగత పనివిధానం, తనిఖీ లోపించడం రద్దు కావాలి.

ప్రతి సెక్రటేరియట్ సభ్యుడు కేంద్రకార్యనిర్వాహక వర్గంయొక్క విభాగాల్లో ఏదోఒకదానికి లేదా కొన్నిటికి వ్యక్తిగతంగా బాధ్యత వహించవలసి యుంటుంది. సెక్రటేరియట్‌కే క్రమబద్ధంగా రిపోర్టులు పంపడానికి, నిర్ణయాలను అమలు జరపడానికి కూడా వ్యక్తిగత బాధ్యత వహించవలసి యుంటుంది.

సెక్రటేరియట్ సభ్యులు పూర్తిగా కేంద్రం పనిలోనే నిమగ్నులవ్వాలి. అయితే, వారిసంఖ్య చిన్నది గనుక కేంద్రం యొక్క బాధ్యతలన్నిటినీ వారంతటవారే నిర్వహించలేరు. కేంద్రం పనిని సెక్రటేరియట్ సభ్యులేకాక, జాతీయ కౌన్సిల్ లోని యితర సభ్యులుకూడా - ముఖ్యంగా కేంద్ర కార్య నిర్వాహకవర్గ సభ్యులు - నిర్వహించవలసి యుంటుంది.

పొలిట్ బ్యూరోలోని అనేకమంది సభ్యులు 'అవ కాశమున్నప్పుడు' మాత్రమే పొలిట్‌బ్యూరో సమా వేశాలకు హాజరవుతున్నారు. ఇట్టి పద్ధతికి స్వస్తిచెప్పవలసి యుంది. కేంద్ర కార్యనిర్వాహకవర్గ సభ్యులు కేవలం రాష్ట్ర కమిటీ కార్యకర్తలేకాదు. జాతీయ కౌన్సిల్‌చే వారెన్నుకో

బడ్డారు. అందుచేత జాతీయ కౌన్సిల్‌కి వారు బాధ్యత వహించి కేంద్రంయొక్క పనిని సక్రమంగా నిర్వహించవలసి యుంటుంది. వారికి రాష్ట్ర బాధ్యత లేకాక కేంద్ర బాధ్యతలు కూడా ఉన్నాయి. కేంద్ర కార్యనిర్వాహకవర్గం ఎప్పుడు ఆదేశిస్తే అప్పుడు వారు వెళ్ళి తమ బాధ్యతలను నిర్వర్తించ వలసి యుంటుంది. ఉదాహరణకు కొన్ని రాష్ట్రాలకు వారు వెళ్ళవలసి వస్తుంది; లేదా పార్టీ పాఠశాలలను నడుపవలసి యుంటుంది; వివిధ సమస్యల అధ్యయనానికి కావలసిన సమాచారం సేకరించవలసి యుంటుంది; కేంద్రం నడిపే పత్రికలకు వ్యాసాలు వ్రాయవలసి యుంటుంది. జాతీయ కౌన్సిల్, కేంద్ర కార్యనిర్వాహక వర్గం చేసిన నిర్ణయాలు రాష్ట్ర కమిటీలచే అమలు జరపబడేటట్లు చూడవలసి యుంటుంది.

కేంద్ర కార్యనిర్వాహకవర్గం ప్రతిసారి సమావేశమైన తర్వాత దాని నిర్ణయాలను, వాటిపై వివరణనూ జాతీయ కౌన్సిల్ తన సభ్యులందరికీ పంపవలసియుంటుంది.

కొంతమంది కామ్రేడ్స్ యిలా ప్రశ్నించవచ్చు: ఇవన్నీ జరిగి తీరుతాయనే హామీ ఏమిటి? ముఖ్యంగా యిలాంటి వాగ్దానాలెన్నో యిదివరకు చేయబడ్డాయి; కేంద్రం పనిచేయనంతకాలం మొత్తం పార్టీపని కుంటుపడుతోంది. మనకీ విషయంలో బాగా అనుభవం వుంది. అలాంటప్పుడు — యికముందు మాత్రం అట్టి కేంద్రం తప్పకుండా ఏర్పడు తుందనుకోవడం ఎలాగు?

ఇందుకు ఒకటే హామీ వుంది. ప్రస్తుత మహాసభలో ఎన్నుకోబడే జాతీయసమితి అలాంటి కేంద్రం తప్పక ఏర్పడేటట్లు

చూస్తుం తన కర్తవ్యంగా ఎంచుతుంది. ఇందుకు అది సరియైన, సమర్థులైన సభ్యుల్ని కేంద్రకార్యనిర్వాహకవర్గానికీ, సెక్రటేరియట్‌కీ ఎన్నుకోడమే కాక, వాటి పనిని శక్తివంతంగా అజమాయిషీ చేస్తూఉంటుంది; తన సూచనలతోను, విమర్శనలతోను సహాయపడుతూ వుంటుంది. తమ బాధ్యతలను నిర్వర్తించని వారిని ఆ కమిటీలనుంచి తొలగించి వారి స్థానాల్లో యితరులను తీసుకోడానికికూడా వెనుదీయదు.

అంతేకాదు. కేంద్ర కార్యనిర్వాహక వర్గంలోని, సెక్రటేరియట్‌లోని ప్రతి సభ్యుడు యే పని చేయాలో, ఎక్కడ పని చేయాలో నిర్ణయించవలసింది పై కమిటీయే గాని, అతడు సభ్యుడుగా వున్న క్రింది కమిటీ కాదు; తన అభిప్రాయం తెల్పడానికి అతనికి తప్పక అవకాశం వుంటుంది. కాని, నిర్ణయం చేసేదిమాత్రం పై కమిటీయే. ఇకమీదట దీన్ని ఒక నిర్మాణ సూత్రంగా పరిగణించాలి.

## రాష్ట్ర కమిటీలు

రాష్ట్రకమిటీలు కూడ తమ పనిని పునర్వ్యవస్థీకరించుకోవాలి. రాష్ట్రాల్లోకూడ పనిచేసే సెక్రటేరియట్లు అత్యంత ప్రాధాన్యత వహిస్తాయి. అయితే వివిధరాష్ట్రాల పరిస్థితి చాల భిన్నంగా ఉండడంవల్ల రాష్ట్రసెక్రటేరియట్ల పనిని గురించి, ఆ పనిని నిర్వహించవలసిన పద్ధతుల్ని గురించి ఇప్పుడే చెప్పడం కష్టం. అయినా, కొన్ని స్థూలమైన అభిప్రాయాలను తెలియ జేయవచ్చు.

— అనేక రాష్ట్రాలలో నిజమైన పార్టీ నాయకత్వమంటే యిద్దరు ముగ్గురు కామ్రేడ్స్ మాత్రమేనన్న అర్థం

ఏర్పడింది. అంటే కేంద్రీకృతాధికారం మరీ ఎక్కువగా ఉందన్నమాట. ఇది కార్యరంగంలో అరాచకత్వానికి దారి తీస్తుంది; అధికారవర్గ దొరతనపు పోకడ (బ్యూరాక్రసీ) తీవ్ర మవడానికికూడా కారణమవుతుంది. అంతేకాదు. కార్యకర్తల అభివృద్ధిని యిది నిరోధిస్తుంది. అందుచేత యీలోపాన్ని సరిదిద్దవలసియుంది. తాను శక్తివంతగా నిర్వర్తించలేనన్ని విధులను, బాధ్యతలను ఏ కామ్రేడ్‌కీ యివ్వకూడదు. రాష్ట్ర బాధ్యతలను రాష్ట్ర కమిటీ సభ్యులంతా పంచుకోవాలి.

—సమిష్టి కార్యాచరణ, వ్యక్తిగత బాధ్యత, సమిష్టి తనిఖీ అనే సూత్రాన్ని ఆధారం చేసుకొని కార్యదర్శితో సహా ప్రతి సెక్రటేరియట్ సభ్యుని విధులను స్పష్టంగా నిర్వచించాలి.

— రాష్ట్ర కమిటీలు సమావేశమయేముందు సరియైన సన్నాహాలు చేసుకోడం అవసరం. అలా చేస్తే ఎప్పటికప్పుడు నిర్ణయాలు తీసుకోడం, ఎవరు యే పని చేయాలోకూడ నిర్ణయించడం సాధ్యమవుతుంది.

— ప్రతి సెక్రటేరియట్ సమావేశం, రాష్ట్ర కమిటీ సమావేశం, రాష్ట్రసమితి సమావేశం అంతకు తొలిసమావేశపు నిర్ణయాలను చదవడంతో, అవి ఏవిధంగా ఎంతవరకు అమలుజరపబడ్డాయో తెలియజేసే నివేదికతో ప్రారంభమవాలి.

—రాష్ట్ర కార్యనిర్వాహకవర్గంయొక్క, రాష్ట్రసమితి యొక్క ప్రతిసమావేశాన్ని గురించి కేంద్రానికి రిపోర్టులు పంపుతూ ఉండాలి.

— పార్టీ పత్రికలను మెరుగుపరచడ మెలాగో, అవి అన్ని ప్రాంతాలకు వెళ్ళేటట్లు వాటి సంఖ్యను పెంచడమెలాగో, వాటిని గట్టి ఆర్థిక పునాదిపై నిలబెట్టడమెలాగో తెలుసుకో నేందుకు క్రమపద్ధతిలో వాటిని గురించి సమీక్షించడం, మొత్తం పార్టీలో వాటినిగురించి చర్చలు నడపడం అవసరం.

— రాష్ట్ర శాసనసభల్లోను, జిల్లా బోర్డులు తదితర స్థానికసంస్థల్లోను జరిగే పనిని దఫాలవారీగా సమీక్షించవలసి యుంది. ఆ సమీక్షలను పార్టీకంతకూ అందజేయవలసి యుంది.

— ఇంతకన్న ముఖ్యమైన విషయమేమంటే, రాష్ట్ర కార్యనిర్వాహకవర్గానికీ, జిల్లా కమిటీలకూ మధ్యనున్న సంబంధాన్ని పటిష్టమొనర్చాలి. ఇందుకు రాష్ట్రవ్యాపిత ఉద్యమాలను ప్రారంభించి అభివృద్ధి చేయడం అవసరం. ఇలా చేయకపోతే, ఎంత తీవ్రమైన కృషి అయినాసరే స్థానిక, ఆర్థిక స్థాయిలోనే వుండిపోతుంది; రాష్ట్ర ప్రజల జీవితంమీద దాని ప్రభావం ఉండదు. పార్టీ పత్రిక రాష్ట్రంలోను, రాష్ట్రంలోని ప్రాంతా లన్నిటిలోను అభివృద్ధిచెందే ప్రజాఉద్యమాన్ని ప్రతిబింబించే టట్లు నడుపబడాలి. బహిరంగసభల్లో ఉపన్యసించడానికేగాక, జిల్లా కమిటీలతోను, స్థానిక కమిటీలతోను, వాటి కార్య కర్తలతోను నిర్దిష్ట సమస్యలను చర్చించడానికికూడా దఫాల వారీగా జిల్లాలలో పర్యటించాలి. వివిధజిల్లాలలోని కార్య కర్తలతో మానవ ప్రేమను దీపించే సన్నిహితమైన సంబంధా లను పెంపొందించుకోవాలి. స్థానికసంస్థలలోను, మున్సిపాలి టీలలోను, పంచాయితీలలోను జరిగే పనికి సంబంధించిన

సమస్యలను చర్చించడానికి ప్రత్యేక సమావేశాలు ఏర్పాటు చేయాలి.

— పనిని క్రమబద్ధమొనర్చడంలో ఏయే అంశాల కెంతెంత ప్రాధాన్యత యివ్వాలో తెలుసుకోవాలి. ఇందుకు వివిధ సమస్యలను దృష్టిలో ఉంచుకోడమే కాక, పార్టీ యొక్క నిర్మాణబలాన్ని కూడా గమనించాలి. పెద్ద పెద్ద పథకాలను వేసుకొని తర్వాత వాటిని చల్లగా విడిచిపెట్టే పద్ధతిని విడనాడాలి.

ఇవన్నీ జరగాలంటే, చక్కగా పనిచేసే రాష్ట్ర సెక్రటేరియట్లు అవసరం. ఐతే సెక్రటేరియట్ సభ్యులు మాత్రమే యీ విధులన్నిటినీ నిర్వహించలేరు. రాష్ట్ర కర్తవ్యాలకు సెక్రటేరియట్ సభ్యులేకాక, కార్యనిర్వాహకవర్గ సభ్యులందరు బాధ్యత వహించవలసియుంటుంది.

సమిష్టి కార్యవిధానం; వ్యక్తిగత బాధ్యత; తనిఖీ పద్ధతి

ప్రతి పార్టీ యూనిట్లోను — ముఖ్యంగా కేంద్ర, రాష్ట్ర, జిల్లా సెక్రటేరియట్లలో — సమిష్టి కార్యవిధానం, వ్యక్తిగత బాధ్యత, తనిఖీ పద్ధతి అనేవాటి ఆధారంమీద మొత్తం పనిని క్రమబద్ధం చేసుకోవాలి.

పార్టీలో నేడు యిది లోపిస్తూంది. సమిష్టి కార్యవిధానమంటే నిర్విరామంగా జరిగే సమావేశాలనీ, వ్యక్తిగత బాధ్యత అంటే 'స్వపరిపాలన', తమపనిలో 'యితరులజోక్యం లేకపోవడం' అనీ భావింపబడుతోంది. తనిఖీ యించుమించు అదృశ్యమైందనే చెప్పవచ్చు. ఇట్టి పనివిధానంవల్ల పరిస్థితులు ఎన్నటికీ చక్కబడవు.

నిర్ణయాలను అమలు జరిపే విషయంలో ప్రతి పార్టీ యూనిట్ పై కమిటీకేగాక క్రిందియూనిట్లకు, మొత్తం పార్టీ సభ్యులకు సమిష్టిగా బాధ్యత వహించవలసియుంటుంది. కాని కమిటీలో, సెక్రటేరియట్‌లో సమిష్టి నిర్ణయాల ఆధారం మీద, సమిష్టి తనిఖీ ఆధారంమీదవ్యక్తులు తమ పనికి తాము బాధ్యత వహించాలనే సూత్రాన్ని పాటించాలి. ఇట్టి విధానం వల్లనే నిర్ణయాలు అమలు జరగడానికి అవకాశం కల్గుతుంది.

## పార్టీనంతనూ కదలించవలసిన ఆవశ్యకత

ప్రజలు సౌఖ్యవంతమైన జీవితంకొరకు జరిపే పోరాటాల్లోను, వారి కార్యకలాపాలన్నిటిలోను ప్రాథమికయూనిట్లు — అనగా శాఖలు — నాయకత్వం వహించేటట్లు మన కార్య విధానాన్నీ ప్రజల్లో చేసే పనిపద్ధతినీ మార్చుకోవాలి.

నేడు మనపార్టీ ప్రజల్లోఉన్నతస్థాన మాక్రమిస్తున్నప్పటికీ,మన కార్యవిధానంలో ఎట్టిమార్పుకనబడ్డం లేదు. ఆచరణకు సంబంధించిన మన కార్యకలాపాలు ప్రధానంగా ఎన్నికలకు, మహాసభలకు, స్థానిక పోరాటాలకు, అప్పుడప్పుడు జరిగే కొన్ని ఉద్యమాలకు మాత్రమే పరిమితమై ఉన్నాయి. పార్టీయొక్క మామూలు పని యించుమించు పూర్తిగా హోల్‌టైమర్ల ద్వారానే జరుగుతోంది. ఒకవైపు కార్యకర్తల కొరత, మరొకవైపు అత్యధిక సంఖ్యాకులైన పార్టీసభ్యులు చాలకాలంనుంచి పనిచేయకపోవడం — యిది మన పార్టీ జీవితంలో ప్రత్యేకలక్షణంగా తయారైంది.

హోల్‌టైమర్ల మీద పూర్తిగా ఆధారపడ్డంవల్ల, వారిలో చాలమంది అంతకంతకు ప్రజల జీవితంనుంచి దూర

మవడంవల్ల కూడా పార్టీలో స్వీయమానసిక ధోరణులు, పిడివాద ధోరణులు, సెక్టేరియన్ ధోరణులు తీవ్రమయాయి. పార్టీలో రెండు తరగతుల సభ్యులు — పనిచేసేవారు పని చేయనివారు — తయారవడానికి యిది దారితీసింది.

రాజకీయ తీర్మానం ప్రజల్లో బహుముఖ కార్యాల అవసరాన్ని నొక్కిచెప్పింది. ప్రజా ఉద్యమాన్ని పటిష్ఠ మొనర్చడానికి, పార్టీ పునాదిని శక్తివంత మొనర్చడానికి యిది చాల అవసరం. తీర్మానంలో చెప్పబడిన ప్రకారం అన్నిరంగాల్లోను నిర్విరామంగా కృషి జరిగేటట్లు పార్టీ శ్రద్ధ వహించాలి. అప్పుడు ప్రతి పనికీ కామ్రేడ్స్ లభిస్తారు; ప్రతి కామ్రేడ్ కీ చేతినిండా పని వుంటుంది.

ఇందుకు మనం స్థానిక అవసరాలను జాగ్రత్తగా పరిశీలించాలి. పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన స్కీములు, ప్రభుత్వంయొక్క అభివృద్ధి ప్రణాళికలు యెలా పని చేస్తున్నాయో తెలుసుకోవాలి. ప్రజలకు వుపయోగం జరిగేటట్లు చూడ్డానికి వాటిలో . మనం చురుగ్గా పాల్గొనాలి. ఇలా చేయకపోతే, ప్రజాసంఘాలను నిర్మించడంకూడా అసాధ్య మవుతుంది. ఈ విషయం చాలసార్లు నొక్కిచెప్పబడింది; కొంత అభివృద్ధికూడా జరిగిందనడంలో సందేహం లేదు. కాని అది చాల స్వల్పం. ఇట్టి పనుల విషయంలో నాయకత్వ కమిటీల, కార్యకర్తల దృక్పథం యిప్పటికీ సంకుచితంగానే, సెక్టేరియన్ ధోరణిలోనే ఉంది.

## హోల్ టైమర్ల ప్రాధాన్యత

మొత్తం పార్టీని కార్యరంగంలోకి దింపాలనీ, సభ్యులందరికీ పనియివ్వాలనీ నొక్కిచెప్పినంతమాత్రాన హోల్ టైమర్ల ప్రాధాన్యతను తక్కువ అంచనా వేస్తున్నట్టు కాదు. పార్టీవిస్తృతమయ్యేకొద్దీ హోల్ టైమర్లు అంతకంతకు అధికంగా కావలసివస్తారు. కనుకనే వారి కనీస అవసరాలకు తగిన ఏర్పాట్లు మనం చేయాలి; వారు ఇందుకోసం తమ స్నేహితుల మీద, అభిమానులమీద ఆధారపడకుండా చూడాలి. హోల్ టైమర్లకు రెగ్యులర్ గా తగినంత వేతనాలను చెల్లించాలి. పార్టీయూనిట్ల ఆదాయవ్యయపట్టికల్లో హోల్ టైమర్లకీయవలసిన వేతనాలను అతి ప్రధానమైన అంశాల్లో ఒకటిగా పరిగణించాలి. హోల్ టైమ్ కార్యకర్తలకు వైద్యసహాయం కల్పించే విషయంలో ప్రత్యేకశ్రద్ధ వహించాలి.

వెంటనే ప్రతి రాష్ట్రకమిటీ పార్టీలో హోల్ టైమర్ల పరిస్థితిని గురించి, వారుచేసే పని స్వభావాన్ని గురించి, పార్టీగాని ప్రజాసంఘాలుగాని వారికి చెల్లించే వేతనాలనుగురించి సమగ్రమైన నివేదికను తయారుచేసి, ఈ ప్రధాన సమస్యపై ఒక పంథాను రూపొందించవలసి యుంది.

## పార్టీ నిధులు

ఈనాడు అన్ని స్థాయిలలోను పార్టీ యూనిట్లు తీవ్రమైన ఆర్థిక దుస్థితిలో ఉన్నాయి. ఇందుకు కారణం, ప్రజలు పార్టీకి ధనసహాయం చేయడానికి సిద్ధంగా లేకపోవడం కాదు. పార్టీ ప్రజల వద్దకు ఒక ప్లానుప్రకారం నిధి సేకరణకోసం వెళ్ళకుండాఉండే అలవాటే యిందుకు కారణం. ఇటీవల

అనేక రాష్ట్రాల్లో జరిగినట్లు అలా ప్రజలవద్దకు వెళ్లినప్పుడల్లా నిధులు వసూలవుతూనే ఉన్నాయి.

ఇకమీదట రాష్ట్రకమిటీలు ఏటా కనీసం రెండేసి నెలలు రాష్ట్రవ్యాపితంగా ప్రజలనుంచి పార్టీనిధి వసూలు చేసేందుకు ఉద్యమాల్ని నిర్మించవలసి యుంటుంది; ఇందుకై మొత్తం పార్టీని సమీకరించవలసి యుంటుంది; ప్రతి పార్టీ నాయకుడు - ముఖ్యంగా విస్తృత పలుకుబడి గలవారు - స్వయంగాను, ప్రత్యక్షంగాను యీ ఉద్యమంలో పాల్గొన వలసి యుంటుంది.

పార్లమెంటు సభ్యులు, శాసన సభ్యులు చెల్లించవలసిన లెవీలు కేంద్ర, రాష్ట్ర కమిటీల ఆదాయపు వనరులలో ఒక ముఖ్యాంశంగా వున్నాయి. కాని యీ విషయంలో ప్రస్తుత పరిస్థితి చాల అసంతృప్తికరంగా వుంది. చాలమంది పార్లమెంటు సభ్యులు తమ లెవీలను రెగ్యులరుగా చెల్లించడం లేదు. వారిలో కొంతమంది తమవద్ద రాష్ట్ర జిల్లా కమిటీలు చాల హెచ్చు మొత్తాలు అడుగుతున్నాయంటూ కారణం చెబుతున్నారు. శాసన సభ్యుల్లోకూడ చాలమంది అనేక రాష్ట్రాల్లో బాకీ పడుతున్నారు. పార్టీ కార్యకర్తలు భక్తి శ్రద్ధలతో పని చేయడంవల్ల, పార్టీకిగల పలుకుబడివల్ల మాత్రమే పార్లమెంటు సభ్యుల, అసెంబ్లీ సభ్యుల విజయం సాధ్యమైంది. ఇట్టి పరిస్థితుల్లో వారు ప్రదర్శించే నైవిధమైన వైఖరి పార్టీయొక్క ఆర్థిక యిబ్బందులను ఎక్కువ చేయడమే కాక, మొత్తం పార్టీలో నిరాశ నిస్పృహా కలగడానికి కూడా కారణ మవుతుంది.

రాష్ట్రకమిటీలు యితర పార్టీసభ్యులనుంచి కూడా క్రమాభివృద్ధిసూత్రంపై లెవీలు వసూలుచేసే పద్ధతిని ప్రవేశ పెట్టాలి.

వీటితో బాటు పార్టీయూనిట్ల నిధులన్నిటినీ కేంద్రీకృత మొనర్చడం అవసరం; వ్యక్తులు పార్టీ నిధుల్ని స్వతంత్రంగా ఖర్చుచేసేపద్ధతిని రద్దుచేయాలి. ప్రతివ్యక్తీ పార్టీకోసం వసూలు చేసే ధనాన్ని తన యూనిట్ కోశాధికారికి యిచ్చివేయాలి; తన యూనిట్ నిర్ణయాల ననుసరించి దాన్ని ఖర్చుచేయాలి.

## పార్టీ విజ్ఞానం

పార్టీసభ్యులకు క్రమపద్ధతిలో విజ్ఞాన ప్రబోధం చేయవలసిన అవసర మెంతఉందో వేరే చెప్పవలసిన పనిలేదు. కేంద్రకార్యనిర్వాహకవర్గం నిర్మించనున్న విజ్ఞాన విషయిక సమితిని గురించి, అది తయారుచేయవలసిన పాఠ్యక్రమాన్ని గురించి యిదివరకే చెప్పబడింది. దీన్ని ఆధారంగా చేసుకొని వివిధ రాష్ట్రాల్లో వారంనుంచి పది రోజులవరకు నడిచే పాఠశాలలను నిర్వహించవలసియుంది. వీటి అవసరం చాలా ఉన్నప్పటికీ, యివి మాత్రమే సరిపోవు.

ప్రజానురంజకమైన సాహిత్యాన్ని ప్రచురించడంకూడ విజ్ఞానప్రబోధమే. ట్రేడ్ యూనియన్లు, రైతు సంఘాలు మొదలైన ప్రజాసంఘాల్లో పనిచేసే కార్యకర్తలకోసం పాఠ శాలలను నడపడంకూడా విజ్ఞానప్రబోధం క్రిందికే వస్తుంది. అలాగే స్థానిక సంస్థలు, సహకార సంఘాలు, సంక్షేమ కేంద్రాలు, డెవలప్ మెంటు బోర్డులు మొదలైన సంస్థలలో

జరుగుతున్న పనియొక్క అనుభవాన్ని క్రోడీకరించి సాధారణ నిర్ణయాలు చేయడంకూడా విజ్ఞాన ప్రబోధమే.

మన కార్యకర్తల్లో అఖిలభారత చైతన్యాన్ని పటిష్ఠ మొనర్చడంకూడా విజ్ఞాన ప్రబోధంయొక్క లక్ష్యాలలో ఒకటిగా ఉండాలి. ఈ చైతన్యం యిటీవలి సంవత్సరాల్లో అంతకంతకు తగ్గుతూవచ్చింది. ఒక రాష్ట్రంలోని కామ్రేడ్స్‌కి యితర రాష్ట్రాల్లో జరిగే ఘటనలనుగురించి తెలియదు. ఇకమీదట ఒక రాష్ట్రానికి చెందిన నాయకులు యితర రాష్ట్రాలకు దఫాల వారీగా వెళ్ళి రాష్ట్ర కమిటీలకు, కార్యకర్తలకు రిపోర్టులిచ్చే కార్యక్రమాన్ని సంఘటిత మొనర్చాలి. రాష్ట్ర కమిటీలు తమ ముఖ్య ప్రచురణలను అనువదించి కేంద్రానికి పంపుతూ వుండాలి; అలా చేస్తే వాటిని కేంద్రం యితర రాష్ట్ర కమిటీలకు పంపుతుంది.

కార్మికవర్గంనుంచి, రైతాంగంనుంచి వచ్చిన అనేక మంది పార్టీ సభ్యులకు చదువు, సాధారణ విద్య నేర్పడం అవసరం. ఇట్టి విద్యా ప్రబోధం పార్టీయొక్క ప్రధాన కర్తవ్యాలలో ఒకటిగా పరిగణించి ప్రతి యూనిట్ యీ కార్యక్రమాన్ని సంఘటితరూపంలో కొనసాగించేటట్లు శ్రద్ధ వహించాలి.

పార్టీ సభ్యులందరూ రాష్ట్రంలో ప్రచురింపబడే పత్రికలను చదివి అర్థం చేసుకొనేటట్లు, ఎప్పటికప్పుడు జాతీయ - అంతర్జాతీయ పరిణామాలను అవగాహన చేసుకొనేటట్లు ఒక ఏడాదిలోగా తగినంత జ్ఞానాన్ని వారికి కలుగజేయాలి.

# పార్టీని విస్తృత మొనర్చవలసిన అవసరం

మన పార్టీ యిదివరకుకన్న యిప్పుడు అభివృద్ధి చెంది నప్పటికీ, యింకా అది చిన్నదిగానే వుంది. అంతేకాదు. ఎన్నో ప్రాంతాల్లో పార్టీ లేనేలేదు. బలంగావున్న రాష్ట్రాల్లో సైతం అనేక ప్రాంతాల్లో దాని నిర్మాణం చాల బలహీనంగా వుంది. ఒక గ్రామంలో మనకు బలమైన పునాది వున్నప్పటికీ, ఆ నియోజకవర్గానికే చెందిన ప్రక్క గ్రామంలో మనకు అనుచరులు లేకపోవడం తరచు కనిపిస్తోంది. దీనివల్ల ఉద్యమం యొక్క అభివృద్ధి కుంటుపడ్డమే కాక, మన రాజకీయ ప్రజా కార్యకలాపాల్లో చాల ప్రధాన పాత్ర వహించే ఎన్నికల్లో పార్టీ బలహీనపడుతుంది.

రాష్ట్రకమిటీలు యీ పరిస్థితిని నిర్దిష్టంగా పరిశీలించి, ప్లానుప్రకారం పార్టీని కొత్తప్రాంతాలకు విస్తృతమొనర్చేం దుకు, ప్లానుప్రకారం పత్రికల అమ్మకాన్ని పెంచేందుకు, ప్లానుప్రకారం పార్టీపనిని విస్తృతమొనర్చేందుకు పూను కోవాలి. అయితే యిలా విస్తృత మొనర్చడంలో ఒక చిక్కుకూడా ఉంది. స్థానికయూనిట్లు తమ కార్యకర్తల్ని విడిచిపెట్టడాని కిష్టపడ్డంలేదు; కార్యకర్తలుకూడా కొత్త ప్రాంతాలకు వెళ్ళడానికి అయిష్టత చూపుతున్నారు. ఈ చిక్కును మనం అధిగమించవలసియుంది.

పార్టీలోకి కొత్త సభ్యుల్ని చేర్చుకోడం, వారికి విజ్ఞాన ప్రబోధం గావించడం పార్టీయొక్క మామూలు కార్యకలా పాల్లో భాగంగా వుండాలి. కార్మిక వర్గంనుంచి, పేద రైతుల

నుంచి, వ్యవసాయ కూలీలనుంచి వచ్చినవారిని పార్టీ సభ్యులుగా తీసుకొనే కర్తవ్యానికి ప్రత్యేక ప్రాధాన్యత యివ్వాలి. మనం గుర్తించవలసిన విషయ మేమంటే, కార్మికవర్గంలో మన కార్యకలాపాలు హెచ్చినప్పటికీ, పెద్ద పారిశ్రామిక ప్రాంతాల్లోకూడ కార్మికవర్గంనుంచి వచ్చిన పార్టీ సభ్యుల సంఖ్య సాపేక్షంగా తక్కువే.

అంతేకాదు. ప్రజా కార్యకలాపాలను నడపగల నాయకులుగాను, కార్యకర్తలుగాను వారిని తరిఫీదు చేసేందుకు, వారిని ఉన్నత స్థానాలకు ప్రమోట్ చేసేందుకు క్రమబద్ధమైన ప్రయత్నం కనపడ్డంలేదు. మన పార్టీలో పై కమిటీల సభ్యులు ప్రధానంగా కార్మికేతరులుగానే ఉండిపోతున్నారు. దీనివల్ల మనలోని అనేక లోపాలు తీవ్రరూపం దాల్చాయి. పార్టీని విస్తృత మొనర్చడమంటే మన మిూ బలహీనతలను తొలగించుకోడానికి చైతన్యయుతంగా ఏకకాలంలో ప్రయత్నించడమనికూడా అర్థం.

## ఆందోళన, ప్రచారం

కేంద్రకమిటి 1954లోనే-అనగా నాలుగు సంవత్సరాల క్రిందటే - తన నిర్మాణ తీర్మానంలో మన ఆందోళనయొక్క స్వభావాన్ని మెరుగుపరచుకోవలసిన అవసరాన్ని నొక్కిచెప్పింది. అప్పటినుంచి పరిస్థితి చాలవరకు మెరుగుపడి నప్పటికీ, ఆనాడు పేర్కొన్న లోపాలు యిప్పటికీ పూర్తిగా నిర్మూలనం కాలేదు. బహిరంగసభల్లో యిచ్చే ఉపన్యాసాలే కాక, ఒక్కొక్కప్పుడు పార్లమెంటులోను, శాసన సభల్లోను

యిచ్చే ఉపన్యాసాలుకూడ జాగ్రత్తగా తయారు చేసుకున్నవి కావు.

తరచు ఆ ఉపన్యాసాలు అస్తవ్యస్తంగా, చెప్పిన విషయాలే మళ్ళీ చెప్పే పద్ధతిలో వుంటున్నాయి. నినాదాలను వివరించడానికి బదులు వల్లించడం మాత్రమే జరుగుతోంది; హేతువాదానికి బదులు ఆవేశానికి ఎక్కువ ప్రాధాన్యం యివ్వబడుతోంది. వాస్తవ విషయాలను జాగ్రత్తగా చిత్రించడం కనబడదు. ప్రజల్లో అధికమవుతున్న రాజకీయ చైతన్యాన్ని దృష్టిలో వుంచుకోకుండా యెల్లప్పుడూ ఒకే పద్ధతిలో వుపన్యసించడం, సాధారణ సూత్రాలనే వల్లిస్తూ వుండడం కనిపిస్తుంది. పార్టీ సభ్యులుకాని ప్రజలతో దైనందిన సంబంధాలేర్పరచుకొనే సందర్భంలో వ్యక్తులమధ్య ప్రచారం చేయడం, విషయాలను వారికి తెలియజెప్పడం చాలవరకు లోపిస్తోంది.

అంతేకాక, పార్టీ తరఫున నడుపబడే అనేక పత్రికల్లో ఉపయోగింపబడుతూన్న శైలి పడికట్టు పదాలతో నిండియుంటోంది; ప్రజానురంజకంగా ఉండడంలేదు. వాస్తవ విషయాలు తగినన్నిటిని పాఠకులముందుంచడంలేదు; ప్రజల్ని కలవరపెట్టే సమస్యలయెడ తగినంత శ్రద్ధ కనబరచడంలేదు. పార్టీ నాయకుల ఉపన్యాసాలను, ప్రకటనలను సంక్షిప్తపరచి యివ్వగలిగినప్పటికీ వాటిని ఉన్నవి వున్నట్లుగా యిచ్చి బోలెడు స్థలాన్ని వాటికోసం వినియోగించే ధోరణి అప్పుడప్పుడు కనిపిస్తోంది: పార్టీ నాయకులు పత్రికలకు, వ్యాసాలు వ్రాయడమనేది లేదు. తరచు తయారుచేసుకోకుండా యిచ్చే ఉపన్యాసాలు సరిపోతాయని వారు భావిస్తున్నారు.

మన తీర్మానాల్లోకూడా ఇలాంటి లోపాలే ఉన్నాయి. తరచు మన తీర్మానాలు చాల దీర్ఘంగా ఉంటాయి; ఎన్నో విషయాలను వాటిలో చర్చించడం కనిపిస్తుంది; ఎంతో పటాటోపం, నిర్దిష్టత లేకపోవడం, సులభగ్రాహ్యమైన శైలి నుప యోగించకపోవడంకూడ కనిపిస్తుంది.

ఈ లోపాలను మనం శ్రద్ధతో పరిశీలించి, వాటి నిర్మూలనకు చర్యలు తీసుకోవాలి. మన మొక ప్రజాపార్టీగా అభివృద్ధిచెందుతున్నామనే చైతన్యంతో నాయకత్వంకొరకు లక్షలాది ప్రజలు మన పార్టీవైపు చూస్తున్నారనే విషయాన్ని గుర్తించి, కార్మికవర్గంనుంచీ రైతాంగంనుంచీ వచ్చినవారే పార్టీసభ్యులలో అధికసంఖ్యాకులన్న విషయాన్ని మరువకుండా మనం ఉపన్యాసాలివ్వడం, వ్యాసాలు వ్రాయడం అవసరం.

## ప్రజా సంఘాలు

అన్ని తరగతుల ప్రజల్లోను—ముఖ్యంగా కార్మిక వర్గంలోను, రైతాంగంలోను—ప్రజా సంఘాలను నిర్మించేందుకు తీవ్రంగా, అనవరతంగా, దృఢనిశ్చయంతో కృషి చేయకపోతే, ప్రజాపార్టీని నిర్మించడం అసంభవం. అట్టి ప్రజా సంఘాలు లేకపోతే, పార్టీ పలుకుబడి అస్పష్టంగా, చెదురు వాటుగా వుండిపోతుంది. అట్టి సంఘాలు లేనిదే ఐక్యసంఘటన వృద్ధి చెందదు. అట్టి సంఘాలను నిర్మించకపోతే, తామెంత చురుగ్గా పని చేస్తున్నా పార్టీ కార్యకర్తలు ప్రజలకు దూరంగా వుండిపోతారు; పెట్టుబడిదారీవర్గ రాజకీయ నాయకుల వలె "సాధారణ" రాజకీయ నాయకులుగా తయారవుతారు; కమ్యూనిస్టు నాయకులుగా అభివృద్ధి చెందరు.

ప్రజలు స్వతంత్రంగా వ్యవహరించే నేర్పును ప్రజా సంఘాలు కలుగజేస్తాయి; ప్రజల్లోనుంచి నాయకుల్ని తయారుచేసేవి అవే. అట్టి ప్రజాసంఘాలు లేకపోతే, మనల నెదుర్కొంటున్న ఏ సమస్యనూ పరిష్కరించజాలం; ప్రజా వుద్యమం విస్తరించదు; యిప్పటికన్న వున్నతస్థాయికి అది అభివృద్ధిచెందదు.

కనుకనే పైన వివరించిన పార్టీ కార్యకలాపా లన్నిటినీ ప్రజాసంఘాల నిర్మాణంవైపు నడపవలసియుంటుంది. ప్రత్యేకమైన అనుమతి ఉంటేతప్ప ప్రతి పార్టీ సభ్యుడు ఏదో ఒక ప్రజాసంఘంలో చేరితీరాలి.

కార్మిక రంగంలో గొప్ప గొప్ప పరిణామాలు జరుగుతున్నాయి. కాని అనేక పార్టీ కమిటీలు వాటి విషయంలో చాల తక్కువశ్రద్ధ చూపుతున్నాయి. కార్మికుల్లో రాజకీయ కార్యకలాపాలు స్వల్పంగానే ఉన్నాయి. అంతేకాదు. ట్రేడ్ యూనియన్ పనులకు, కార్మిక ప్రాంతాల్లో విద్య తదితర కార్యకలాపాలకు కార్యకర్తలు తక్కువగా ఉన్నారు. నగరాల్లో ఉండే కామ్రేడ్స్ కార్మికుల్లో పనిచేసేందుకు కొంత కాలాన్నైనా వినియోగించేటట్లు వారిని నగర కమిటీలు ఉత్తేజపరచాలి.

రాజకీయతీర్మానంలో పేర్కొనబడినట్లు రైతురంగంలో యిప్పుడున్న బలహీనతను తొలగించుకొని శక్తివంతమైన కిసాన్‌సభను నిర్మించడం అత్యంత ప్రాధాన్యంగల కర్తవ్యం. ఈ కర్తవ్యంపట్ల ప్రతి రాష్ట్రకమిటీ చాల శ్రద్ధవహించవలసియుంది; పార్టీ తన దృష్టిని రైతాంగంవైపు మరల్చవలసియుంది; ఇందుకు తగినంతమంది కార్యకర్తలను కేటాయించ

వలసియుంది; వారిని తరిఫీదు చేసేందుకు, పోషించేందుకు తగు ఏర్పాట్లు చేయాలి. ఇలా చేయకపోతే, మొత్తం ప్రజాస్వామ్య ఉద్యమమే బలహీనంగా ఉంటుంది.

ఏడాదిలోపుగా కిసాన్‌సభ సభ్యత్వాన్ని 20 లక్షలకు పెంచాలి.

ఒక ఏడాదిలో పూర్తిచేయవలసిన కోటాలు, నినాదాలు

ప్రస్తుత మహాసభ పూర్తిఅయాక ప్రతి రాష్ట్ర కమిటీ రాష్ట్రానికంతకూ ఒక నిర్దిష్టమైన కార్యక్రమాన్ని తయారు చేసి, దాన్ని రాష్ట్ర కౌన్సిల్ ముందుంచాలి. రాష్ట్ర కౌన్సిల్ ఆ కార్యక్రమాన్ని చర్చించి నిర్ణయాలుచేస్తుంది. ఆ కార్యక్రమంలో క్రింది అంశాలుండాలి :

— ఏడాదిలోగా కేంద్ర, రాష్ట్ర పార్టీ పత్రికల అమ్మకాలను రెట్టింపు చేయాలి.

— ట్రేడ్ యూనియన్ల, రైతు సంఘాల సభ్యత్వం విషయంలో కోటాలు తీసుకోవాలి.

— పార్టీ బలహీనంగావున్న ప్రాంతాలకు దాన్ని విస్తృత మొనర్చాలి.

— పత్రికల నిర్వహణ, ఆఫీసులకు భవనాలను నిర్మించుకోవడంలాంటి నిర్దిష్ట అవసరాలకు పార్టీనిధి వసూలు చేయాలి.

— ఏడాదిలోగా పార్టీలో నిరక్షరాస్యతను నిర్మూలించాలి.

— వచ్చే ఏడాదిలోగా ప్రచురించవలసిన పుస్తకాల సంఖ్యను, వాటి శీర్షికలను నిర్ణయించాలి.

వచ్చే ఏడాదిలోగా వేసుకొన్న పథకాన్ని, తీసుకున్న కోటాలను ఆధారంగా చేసుకొని ప్రతి జిల్లాకమిటీ తన కార్య క్రమాన్ని తాను తయారు చేసుకోవాలి.

ఆ కోటా లెంతవరకు పూర్తిఅవుతున్నాయో తెలుసు కొనేందుకు దఫాలవారీగా జరిగిన పనిని సమీక్షించుకోవాలి.

## వ్యక్తిగత అహంకారాన్నెదుర్కోవాలి : క్రమశిక్షణను పునరుద్ధరించాలి

పార్టీ తక్షణమే నిర్వర్తించవలసిన నిర్మాణ కర్తవ్యాలు పైన పేర్కొనబడ్డాయి. అయితే, ఆచరణలో మార్పు తీసుకురావడానికి చైతన్యంతోను, దృఢనిశ్చయంతోనుకూడిన ప్రయత్నం లేకపోతే యిదంతా కేవలం కాగితంమీదనే ఉండి పోతుందని గత అనుభవంవల్ల మనం తెలుసుకోవచ్చు.

ఇట్టి ప్రయత్నం పై నుంచి ప్రారంభం కావాలి. అంటే కేంద్ర, రాష్ట్ర నాయకత్వాలనుంచి ప్రారంభంకావాలి. ఆ కమిటీలు, కమిటీ సభ్యులు తమ చైతన్యాన్ని వృద్ధి చేసుకో వాలి; నిర్ణయాలకూ వాటి అమలుకూ మధ్య, మాటలకూ చేతలకూ మధ్య నున్న అంతరాన్ని నిర్మూలించాలి; సర్వ విధాల వారు క్రింది కమిటీలకు ఆదర్శంగా వుండాలి. నమ్రత, సహనం, కామ్రేడ్స్ మధ్య వుండవలసిన ప్రవర్తన, విమర్శల యెడశ్రద్ధ, అన్నిటికన్న ముఖ్యంగా క్రమశిక్షణ—వీటిలో మార్గదర్శకులుగా వుండాలి. ఇవి లేకపోతే, ఏ ఒక్క కర్తవ్యాన్నీ నిర్వర్తించలేం. వ్యక్తిగత అహంభావాన్నెదుర్కోడంతోను, శిక్షణను పటిష్టవంత మొనర్చడంతోనే మొత్తం పార్టీని

పునర్వ్యవస్థీకరించే కార్యక్రమాన్ని ప్రారంభించాలి. ప్రధానంగా పైనున్నవారు ఆదర్శవంతంగా మెలగడంద్వారానే శిక్షణను పటిష్ఠవంత మొనర్చగల్గుతాం.

మొత్తంమీద పార్టీ పరిస్థితి ఎలా వుందంటే, ఒకవైపు ప్రజా ఉద్యమం చాల త్వరితంగా అభివృద్ధి చెందుతూంటే, మరోవైపు మన నాయకత్వం పరిపక్వతలోను, సామర్థ్యంలోను అంత త్వరితంగా అభివృద్ధిచెందడంలేదు. ఇందువల్ల పార్టీలో పెద్దచిక్కులేర్పడ్డాయి. పార్టీ కమిటీలు సరియైన పద్ధతుల్లో పనిచేసినట్లయితే కొంతవరకు యీ చిక్కులను తొలగించుకోవచ్చు. కాని యిది కొంతవరకు మాత్రమే సాధ్యం. అన్ని స్థాయిలలోను పార్టీ నాయకులు - ముఖ్యంగా కేంద్ర, రాష్ట్ర నాయకత్వంలో ఉన్నవారు - సొంతంగా అధ్యయనం చేయడం, ప్రత్యేకశాఖల్లో నైపుణ్యం సంపాదించం, తమ పనిని క్రమబద్ధ మొనర్చుకోవడం ద్వారా వ్యక్తిగత సామర్థ్యాన్ని పెంపొందించుకోవాలి.

పార్టీలోనున్న బలహీనతలను, లోపాలను తొలగించుకోవాలంటే ఏవో కొన్ని ఆచరణ వివరాలకు సంబంధించిన చర్యలు తీసుకున్నంతమాత్రాన సరిపోదు. పార్టీ నిర్మాణానికి సంబంధించిన మూలసూత్రాలు ఎడతెగకుండా ఉల్లంఘింపబడ్డంవల్ల యీ లోపాలు, బలహీనతలు ఉత్పన్నమయాయి. వాటిని తొలగించడానికి భారత కమ్యూనిస్టు పార్టీ ప్రత్యేక మహాసభ అన్ని పార్టీయూనిట్లకు ముఖ్యంగా జాతీయ కౌన్సిల్‌కి, కేంద్ర కార్యనిర్వాహకవర్గానికి, సెక్రటేరి

యటాకి యీ క్రింది కర్తవ్యాలను నిర్వర్తించవలసిందని ఆదేశిస్తోంది.

1. అధ్యయనం, విమర్శన – ఆత్మవిమర్శనద్వారా పార్టీపనిని మెరుగుపరచేందుకు ఒక ఉద్యమాన్ని సాగించాలి. ఈ ఉద్యమం ప్రధానంగా వ్యక్తిగత అహంభావాన్ని నిర్మూలించుకోడం, క్రమశిక్షణను పునరుద్ధరించడం, మాటలకు చేతలకు మధ్యనున్న అంతరాన్ని తొలగించడం, కామ్రేడ్స్ మధ్య ఉండవలసిన సంబంధాలను పటిష్ఠమొనర్చడం అనే లక్ష్యాలపైపు నడుపబడాలి.

2. పార్టీ కార్యక్రమాన్ని తయారుచేసేందు కవసరమైన ఒక యంత్రాంగాన్ని నెలకొల్పాలి.

3. మార్క్సిస్టు – లెనినిస్టు మూల సూత్రాలను గురించి పార్టీ సభ్యులందరికీ విజ్ఞానప్రబోధం చేయాలి.